# అనుమానం

(విషాదాంత సాంఘిక నాటకం)

రచన:- జి. కృష్ణమూర్తి బి. ఏ.

మొదటిముద్రణ: 1958

Publishers

Santi Amateur Artists Association
Berhampur

వెల: రూపాయి పావలా

Press:- RAMA KRISHNA PRESS. Rajahmundry.

## విజ్ఞాపన

"కడుపుకోసం కష్టించే ఉద్యోగానికే ఒళ్ళు పరీక్ష చే
య్యించు కుంటున్నప్పుడు, తరతరాల వంశాన్ని నిలపాలని చేసు
కొనే పెళ్లికి ఎందుకు పరీక్ష చెయ్యించుకోరాదు?
అనే సమస్యను సూచిస్తూ సాగిందీనాటకం. ప్రదర్శించిన చో
ట్లలో ప్రశంశల నందుకున్నది. దీన్ని అందరిముందూ పెట్టా
లనే అభిలాషతో ప్రచురణకి పూనుకొన్నాం. మీ ఆదరాభి
మానాలను కూడ పొందితే మాశ్రమ ఫలించినట్టే

అడిగిన వెంటనే శ్రమఅనకుండా తమ అమూల్య అభి
ప్రాయాన్ని అందించిన ప్రముఖ కళాకారులకు మాకృతజ్ఞత
పూర్వకవందనాలు.

ఇట్లు
విధేయులు

Santi Amateur Artists Association.
Berhampur

**Note:-** నాటకప్రదర్శన హక్కు-మిగతా హక్కులన్నీ రచయితవి

# అభిప్రాయములు

## శ్రీయుత: N. T. రామారావు B. A.

మదరాసు.

శ్రీమూర్తిగారు రచించిన 'అనుమానం' వినోద ప్రాధాన్యంగా సాగిన విషాదాంతం. చాల బాగున్నది. సన్నివేశాలు దృశ్యవిభజన, అటు ప్రేక్షకులకు యిటు పాఠకులకు, కథాగమనాన్ని సులభంగా, తికమకలులేకుండా అర్థము చేసుకునే రీతి పొందుపర్చ బడ్డాయి చక్కని సాంఘికం అనువైన రీతి సంభాషణలు ముచ్చటగా నున్నాయి. ఆదినుంచి తుదివరకూ పర్యవసానం ఏమవుతుందా అనే ఉత్సుకతను నిలబెట్టుతూ పొంకంగా నడిచింది.

+——+——+

## శ్రీయుత. వి నాగయ్య

మద్రాసు

'అనుమానం' మూడు దృశ్యాలలో ముచ్చటగా ఉంది ఆధునిక నాటక సాహిత్యంలో 'అనుమానం' నిరుపమానం సందర్భోచితమైన సంభాషణలు, సరసమైన నడక, ఆద్యంతం, రక్తి కట్టే రసవత్తర సన్నివేశాలు, యీనాటకానికి రసపుష్టి చేకూర్చాయి.

అన్నివిధాల 'అనుమానం' అత్యుత్తమంగా ఉందనుటలో అనుమానం ఎంతమాత్రం లేదు.

శ్రీయుత. S. V. రంగారావు B. Sc.,

మద్రాసు

నాటకాల్లో ప్రత్యేక లక్షణాలున్న పాత్రల్ని సృష్టించడమే కష్టమైనపని. పైగా మానసిక తత్వాలతో పాత్రల్ని సృష్టించడం మరీకష్టం. 'అనుమానం'లో అలాంటి పాత్రల్ని మనం చూస్తాం శ్రీమూర్తిగారు సన్నివేశాల్లోని సంఘర్షణను ధైర్యంగా Direct గా నడిపించారు. చాలా బాగుంది. ప్రతిమాటలో Human Psychology పొదగించారు. పాత్రల సృష్టీ పరిచయం, పోషణా చాలా చక్కగా ఉంది. భాష అతి మాధుర్యంగా, మనకు చాలా సన్నిహితంగా వుండే వ్యావహారికం ప్రదర్శించడానికి యిది ఒక మంచి నాటకం.

+——+——+

శ్రీయుత. K. జగ్గయ్య B. A. (Lit)

మద్రాసు

'అనుమానం'లో నాకు కనిపించిన ముఖ్యవిశేషాలు మూడు (1) ఇతివృత్తంలో విశిష్టత (2) ప్రదర్శనా సౌలభ్యం (3) సాఫీగా నడచిపోయే సంభాషణలు.

మానవ విజ్ఞానానికి రెండు ముఖ్యమైన అంగాలు శాస్త్ర కళ. (Science and Art) శాస్త్రి హృదయం లేదు. హృదయం లేనిది కళ లేదు. శాస్త్రం, కళల సమన్వయం అరుదు పీటి సమన్వయం యీనాటకానికి యితివృత్తం యిట్టిమహత్తరాంశం దృశ్యరూపకం కావడంలో నాటకం విలువ నూరురెట్లు హెచ్చింది. ఆ రెండింటి సంఘర్షణ గుండెలులో తరుక్కుపోయే పరిణామానికి తీసుకెళ్తుంది. చివరన ప్రతివాడి గుండెలు నీరు చేస్తుంది,

ప్రదర్శన యోగ్యతకున్న యిబ్బందులన్నీ దృష్టిలో పెట్టుకొని ప్రదర్శనా సౌలభ్యాన్ని సాధించి సాగించారు నాటకాన్ని శ్రీమూర్తిగారు. ఏపాత్రలు ఎలా మాటాడాలో చూచి రాశారు.

మంచినాటకాలు కొరతగా ఉన్న మన నేటి తెలుగు నాటక సాహిత్యంలో ఒక ఖాళీ 'అనుమానం'లో భర్తీ అయినందుకు ఆనందించే వాళ్లలో నేనొకణ్ని.

ఈ 'అనుమానం' అనుమానంగానే నిలిచి పోకుండా వుండాలంటే దీనికి నివృత్తి, ఆలోచించాల్సింది సంఘమే పాఠకులూ, ప్రేక్షకులూ 'అనుమానం'లోని ఆంతర్యాన్ని నిజాన్ని సహృదయంతో ఆచరణలో పెడతారని అనుమానం లేకుండా నమ్ముతున్నాను.

## చిన్నవిన్నపం.

మనేంకొత్తగా చెబుతున్నామనుకునేది, ఏనాడో ఎక్కడో ఎవ్వరో చెప్పేవుంటారని నాపూర్తి నమ్మకం. యీనాటకం కూడా అంతే. బీజం ఎలా ఎప్పుడు ఏవిధంగా పడిందో గుర్తులేదు యీవిధంగా రూపొందింది. యిందులో ఏకో అమూల్యమైన సందేశం ఉందని మిత్రులంటున్నారు. కాదని నేనూ అనలేను. నిజం చెప్పాల్సింది మీరు.

కష్టాలకు ఓర్చి దీన్ని ప్రదర్శించారు. నష్టం వచ్చినా భరిస్తామంటూ శ్రమపడించారు. Santi Amateur Artistsకి నే నెన్నో విధాలుగా ఋణపడిఉన్నా.

నాటకం చదివి తమఅభిప్రాయాల్నిస్తూ అభినందించిన పెద్దలకు నా నమోవాచకాలు.

మీకృష్ణమూర్తి



## వచ్చేవారు:

| | | |
|---|---|---|
| వెంకటనారాయణ | ... | 55 |
| గోపాలం | ... | 18 |
| శేఖరం | ... | 25 |
| డాక్టర్ శ్రీనివాసరావు | ... | 48 |
| సీతారామయ్య | ... | 50 |
| హేమలత: | ... | 20 |

దృశ్యాలు : : మూడు

# అనుమానం ప్రదర్శనలు.

| పాత్రలు. | ఛత్రపురం | బరంపురం | విజయనగరం |
|---|---|---|---|
| శేఖరం. | G R. చంద్ర. | K. రఘునాథరావు | G.R. చంద్ర |
| సీతారామయ్య. | M. దక్షిణామూర్తి | M. దక్షిణామూర్తి | M. స్వామిబాబు |
| శ్రీనివాసరావ్. | A. శేషగిరిరావు | K. నరసింహమూర్తి | K. రఘునాథరావు |
| వెంకటనారాయణ. | P. సత్యనారాయణ | D. సూర్యనారాయణ | K. తులసీరావ్ |
| గోపాలం | D.N. పట్నాయక్ | R. పాపారావు | R. పాపారావు |
| హేమలత | చంద్రవదన | రాజేశ్వరి | చంద్రవదన |
| సంగీతం. | మండపాక. | K.R. రావ్ & J.K. రావ్ | K.R. రావ్ & J.K. రావ్ |
| ఆర్కెస్ట్రా. | J.K. రావ్ & పార్టీ | జమాఆర్కెస్ట్రా | జమాఆర్కెస్ట్రా |

# అనుమానం



## మొదటి దృశ్యం

(డాక్టర్ శ్రీనివాసరావు **Consulting Room.** టేబిలుమీద ఉత్తరాలూ, పైన **Paperweight,** కుడివైపు టెలీఫోను, మధ్యనే కేలండరు జనవరి 16ని సూచిస్తూ... గోడనున్న గడియారం తొమ్మిది గంటలు కొట్టడం ప్రారంభిస్తుంది. ఎడమవైపు కుర్చీని దూరంగా లాక్కొని అందులో చేరగిలబడి ఆనాటి పత్రికను బీడీ కాల్చుకుంటూ, చూస్తున్నాడు వెంకటనారాయణ. గంటలు కొడ్తున్న వాచీవైపు చూచి మళ్లీ చదువులో మునిగిపోతాడు. బైట అడుగులు చప్పుడు వినిపిస్తుంది. వెంకటనారాయణ చప్పున బీడీ ఆర్పి కిటికీలోంచి పారేసి పేపరు మడుస్తూ కుర్చీలోంచి లేచి కుడివేపుద్వారందగ్గరికి వెళ్తాడు. గోపాలం ద్వారం అవతల నిల్చొనుంటాడు. గదిలోనికి సంకోచంతో తొంగి చూస్తాడు.)

వెంక- (ఆప్యాయంగా) రండి సార్! లోపలికి రండీ!

గోపాలం- బాబయ్యగారొచ్చారా?

వెంక- అప్పుడేనా? యేదీ? యిప్పుడేకదూ తొమ్మిది కొట్టిందీ! ... యింటినించి తొమ్మిదిన్నరకి బయల్దేర్తారు సార్!



గోపా- బ్రతికాం! ఆలశ్యం అయిపోయిందేమో బాబయ్యగా రొచ్చేసుంటూరు అని నేననుకున్నాను.

వెంక- అవున్లెండి!...మజ్చేసుందిగా! ... అయినా ఆయన ఒక్కేమాత్రం భయమెందుకు సార్? కూర్చోండి సార్! ఒంట్లో ఎలావుంది?

గోపా- (కూర్చొని) వెంకటనారాయణా! యీ రెండు వేళ్లలో ఏదో ఒకటి ముట్టుకో! (చూపుడు వేలూ మధ్యవేలూ చూపిస్తాడు)

వెంక- (చూపుడు వేలుముట్టి) ఎందుకు సార్? పజిలుకేనా? మీ పేరు పేపర్లో చూశాను సార్! నాలుగు తప్పులు వొచ్చాయి.

గోపా- ఔను. వెంకటనారాయణా! చాలా Narrow గా పోయింది. యీ సారి ఖచ్చితంగా వొచ్చితీరవలిసిందే. చచ్చి తీరవలిసిందే! ఎలా తప్పుతుందో చూస్తా.

వెంక- సార్! నాకు తెలియకఅడుగుతా గెలిస్తే ఎంతిస్తారు సార్?

గోపా- యీసారి రెండు లక్షల రూపాయలు! రెండు లక్షలు తెలిసిందా?

వెంక- అబ్బా! రెండు లక్షలే!...ఎంత కట్టాలి సార్?

గోపా— ఒక్క రూపాయా! ఒక్క రూపాయికి రెండు లక్షల రూపాయలు!

వెంక— ఒక్క రూపాయేనా!... నేనూ కట్టే బాధ్యం లేది ... కాని ప్రస్తుతం చేతిలో యిబ్బందిగా ఉంది సార్!

గోపా— నీ కా బాధ అనవసరం వెంకటనారాయణా! నీ పేరుతో నేను పంపిస్తానులే! యీ వేలు ముట్టేవు. యిది నీ పేరున వెళ్తుంది. ఏమో... నీ పేరు రాశేలా వ్రాసో... అదీ చూద్దాం! గెలిస్తే మాత్రం చెరి సగం వాటా!

వెంక— నా కెందుకు సార్ లక్ష రూపాయలు! పిల్లలు గల వాళ్ళి ఆలోచించి మీరే యివ్వండీ!

గోపా— ముందే చెప్పి పెడుతున్నాను. తర్వాత కోట్లలు గొట్టులూ అంటె మంచిది కాదు. ఆ!

వెంక— నా కెందుకులెండి... అంతా మీరే తీసుకోండి. ఏదీ... ఆ చెయ్యిలా యివ్వండి సార్! (సిరంజి జేబులోంచి తీసి మందెక్కించి గోపాలం జబ్బమీద ఇంజెక్షన్ యిస్తాడు. గోపాలం కళ్ళు మూసుకుంటాడు) అయిపోయింది సార్! (యింజెక్షన్ సూదితుడిచి సిరంజి జేబులో పెట్టుకొంటూ)



రేపూ యెల్లుండీ అయిపోతే ఒక కోర్సు పూర్తయిందన్న మాట.

గోపా- వెంకటనారాయణా! ఏమంత తొందరగా యీ సారి గుణం యిచ్చినట్టు కనిపించదే!

వెంక- కోర్సంతా పూర్తవ్వాలి సార్! తొందర పడితే ఎలా సార్? క్రిందటిమాటు మీరు బలవంతం చేస్తే ఏనుయిందో జ్ఞాపకం లేదూ? ఎంత బాధపడిపో యారు? పాతికేళ్ళనించీ కాంపోండర్ గిరీ వెలిగిస్తున్న నాకు తెలియదా సార్? ఏం చెయ్యాలో!

గోపా- అది కాదు వెంకటనారాయణా!

వెంక- మరింకేమిటీ?

గోపా- ఊరినించి, నాన్న అక్కా యిక్కడి కొచ్చారు... యీవాళే.

వెంక- ఆ! నాన్నగారొచ్చారా? అబ్బా! ఎన్నాళ్ళ కొచ్చారు సార్? ఆఫీసుకి రాలేదేం!...చాల సంవ త్సరాలయింది సార్ నాన్నగారిని చూసి! మహా మంచివారు సార్!

గోపా- నిజమే...కానీ యీ జబ్బుసంగతి నాన్నకి తెలిసిపో తుందేమో అని...

వెంక- మీరేమీ భయపడకండి సార్...డాక్టరుగారికే





ఆచోకీ దొరకనివ్వకుండా యిన్నిసార్లు నడిపించిన యీ వెంకటనారాయణ యీనాడు మీకు మోసం చేస్తా డనుకోకండి సార్! పాతికేళ్లనుభవం నాదని మరిచి పోతున్నారు మీరు... అన్నట్టు డాక్టరుగారూ నేనూ మీ నాన్నగారి సంగతి మొన్ననే మాటాడుకున్నాం సార్!... పాపం! యిద్దరికీ చాలస్నేహం సార్!

గోపా- అది యీనాటి స్నేహం అనుకుంటున్నావేంటి? బాల్య స్నేహం! అందుకనే కదూ నన్నీవూరు చదువుకోసం నాన్న పంపించారు!

వెంక- మహాగొప్ప చదువు చదువుతున్నార్ సార్! మీరు! దుబారాగా డబ్బు ఖర్చుచేసి ఒళ్ళూ ఆరోగ్యం పాడు చేసుకుంటున్నారు సార్!... సార్! అనుభవంమీద చెప్తున్నా ... యీ కోర్సు పూర్తయింతర్వాత మీరు కాస్త జాగ్రత్తగా తిరక్కపోతే మాత్రం చాల ప్రమాదం సార్! ముందే చెప్తున్నా!

గోపా- The Great Compounder doctor వెంకట నారాయణ వుండగా నాకు భయం ఏమిటీ?

వెంక- నిజమే ననుకోండి సార్! అయినా అనవసరంగా డబ్బు పాడుచేసుకొనీ...

అనుపానం

గోపా- యిదిగో! ఆ మాట యింకో రెండు రోజులు పోయిన తర్వాత అను. లక్షలు రాబోతుంటే పిసనారిలా బ్రతకమంటావా? యీ దెబ్బతో చూస్తూ కిస్మత్ పల్టాయించాలి.

వెంక- అంటే?

గోపా- యీసారి ఆరువందల తొంభైమూడు రూపాయిలు కడ్తున్నాను. యిందులో నీ పేరున కూడా ఉందిలే ఒకటి! యీ మాటు రాకుండా ఎటు పోతుందో చూస్తాను!

వెంక- ఆరువందల తొంభైమూడు రూపాయలే!

గోపా- ఆ! న్యూమరాలజీ ప్రకారం ... అంటె సంఖ్యా శాస్త్రరీత్యా అది లక్కీ నెంబరట! మన జ్యోతిష్కుడు చెప్పాడు!

వెంక- ఆ! వాళ్ళమాటలకేం సార్! దమ్మిడీకి వందబద్ధాలు చెప్తారు. అనుభవంమీద చెప్తున్నా సార్! యీ లాటరీ వ్యామోహంలో పడి...

గోపా- ఆగు! ఆగు వెంకటనారాయణా! లాటరీని అంత తేలిగ్గా చూడకూ! ఒక కవి ఏమన్నాడో తెలుసా?

వెంక- ఏంటన్నాడు సార్?



గోపా- (పాట) :—

లాటరీ! లాటరీ, లాటరీ!
మనలాటే ఒక లాటరీ!
మన ఫేటే ఒక లాటరీ
ఊరిస్తూ ఊగిస్తూ కడదాక ఆడించే ॥లా॥
నలుపూ తెలుపూ గళ్ళూ
చీకటి రాత్రి పగళ్ళూ
గడులు కుదరగా, పదము సరదగా
కష్టాలూ నష్టాలూ కలిసి
యేటిలో, నట్టేటిలో పడికొట్టుకుపోయే ॥లా॥
పులీ మేకా, అష్టా చెమ్మా ఆరు బావిలీల్
పాములపాళీ, చదరంగం ఎట్ సెట్రాలూ
పాతనవీ - మన తాతతాతలవీ (
నాకక్కర్లే - మన కక్కర్లే!
ప్లేసూవిన్నుల గిండీ రేసూ
టక్కున వచ్చే కాటన్ బ్రాకెట్
క్రాసువర్డులూ, RMDC
వస్తే లక్షా పోతే కాసీ పోతే పోనీ-
మన ఆశలపోతే లాటరీ-మన ఆశలు తీరే ॥లా॥

అనుమానం

(వీధిలో కారు ఆగుతుంది. హారన్ శబ్దం విని గోపాలం గాబరాతో లేస్తాడు)

చచ్చాం వెంకటనారాయణా! యిదేమిటి తొమ్మిదిం బావుకే బాబయ్యగారొచ్చేశారు! ఏమిటి చెయ్యడం? ఎలా వెళ్లడం?

వెంక- అలా గాభరాపడ్తారేం సార్?...యిటు వెళ్లండి! వెంకటనారాయణని నమ్మి ఎవరూ నష్టపోలేదూ కష్టపడలేదూ యింతవరకూ!

(యెడమవేపు ద్వారంలోంచి గోపాలం వెళ్తూ జేబులోంచి రెండు రూపాయినోట్లు వెంకటనారాయణ కిచ్చి తొందరగా నిష్క్రమిస్తాడు. వెంకటనారాయణ అవి చూడకుండానే జేబులో వేసుకొని, గోపాలం టేబిలుమీద విడిచి వెళ్లిన గళ్లకాగితాలు చూసి లేచి ఆలోచించి - మడిచి జేబులో పెట్టుకొంటుంటే శేఖరం కుడి ద్వారందగ్గర కనిపిస్తాడు సంకోచంతో చూస్తూ)

శేఖ- డాక్టర్...శ్రీనివాసరావుగారూ...

వెంక- యింకా రాలేదు సార్! వచ్చేవేళైమయ్యింది. లోనికి రండి సార్! కూర్చోండి సార్!

శేఖ- ఎంతసేపట్లో వస్తారు?

వెంక- వచ్చేస్తారు సార్! యిప్పుడే వచ్చేస్తారు!

అనుమానం



(శేఖరం లోనికి వచ్చి కూర్చుంటాడు.)

వెంక- క్షమించండి సార్! తమరు యింతకు పూర్వం యెప్పుడూ వచ్చినట్లు లేదే యిక్కడికి.

శేఖ- అవును. యీ వూరు కాదులే మాది!

వెంక- చూశారూ? ఎలా చెప్పగలిగానో! పాతికేళ్ల అనుభవం ఉంది సార్! నాకీ కాంపౌండరీలో... అసలు యీ వృత్తిలో ఒక్కసారి ముఖం చూస్తే జ్ఞాపకం ఉంచుకోవాలి సార్!

శేఖ- అహా! ఆ పని అందరికీ చేతనవ్వుతుందా?

వెంక- అసాధ్యం కాదు సార్! చూడండీ! సీసాలు అన్నీ ఒక మాదిరిగానే ఉన్నా అనుభవంవలన టక్కున కావలసిన మందుసీసా అందుకొనే నేర్పు రావడం లేదూ?... అలాగే సార్ యిది కూడా!

శేఖ- అలాగా?

వెంక- అవును సార్! మా డాక్టరుగారు ప్రాక్టీసు పెట్టినప్పటికే పడేళ్ళ అనుభవం నాకుంది సార్!

శేఖ- యింకా డాక్టర్‌గారు గాలేదే?

వెంక- వొచ్చేస్తారు సార్! అంత తొందరకేసయితే నాకు చెప్పండి సార్! అనుమానం అనవసరం సార్!

[2

అర్జంటయితే ... చూశారూ ... మా డాక్టరుగారే ఒక్కొక్కప్పుడు నాతో ఆలోచిస్తూంటారు సార్! అనుభవానికి మించినది లేదని మీకు మాత్రం తెలియదా సార్! కళ్ళు మూసుకొని ఇంట్రావీనస్ యింజక్షన్ యివ్వగలను! అంత అర్జంటయితే చెప్పండి సార్!

శేఖ-అబ్బే! అర్జంటేమీ లేదు. డాక్టరుగారితో మాట్లాడాలి. ఒక సందేహం...

వెంక- సందేహం కాదు సార్! ఆ వయసు అలాంటిది. పాపం మీరేమి చేస్తారు? కళ్ళకి గడ్డికరిచే వయసు... ఏం చేస్తారు? వేడిరక్తం ... డాక్టరుగారి కిచ్చే ఫీజు యివ్వనక్కర్లేదు సార్! ఆలోచించి మీకు సంతృప్తి కలిగితేనే యివ్వండి సార్ మీకు తోచినది. పిల్లలు గలవాణ్ని...

శేఖ- (లేచి) బావుంది! నాకు ఏ జబ్బూ లేదంటే...

వెంక- అదికాదు సార్...కూచోండి సార్...జబ్బు నిజంగా వుండనక్కర్లేదు సార్...అసలు సందేహం కూడా ఒక రకమైన జబ్బే సార్.

శేఖ- బలవంతంగా మందిచ్చేటట్టుందే నీ వ్యవహారం ?

వెంక- బలవంతం ఎందుకు సార్ ?

శేఖ- నీ పేరేంటి ?

వెంక- వెంకటనారాయణ సార్ ! కాంపోండర్ వెంకట నారాయణ అంటే అందరికీ తెలుసు సార్ ! నిజం చెప్పాలంటే యీ ఊరిలో నన్ను మించిన అనుభవ శాలి లేడంటే నేను గర్వంతో అంటున్నాననుకోవద్దు సార్ ! చూశారూ మా డాక్టరుగారికంటే నా దగ్గరికే ఎక్కువ కేసు లొస్తుంటాయి.

శేఖ- డాక్టరు శ్రీనివాసరావుగారంటే యింత పేరు ప్రఖ్యాతు లున్నాయి!

వెంక- వున్నాయి సార్ ! మా డాక్టరుగారు పెద్ద పేరున్న Heart Specialist సార్! ఆయన్ని మించినవెయ్యి లేదు సార్ గుండెజబ్బులకు. అయితే... పెద్ద డాక్టర్ల దగ్గరకు పెద్దవాళ్ళే రాగలరుకదండీ... బాగా డబ్బుండీ యిచ్చుకోగలవాళ్లే కదండీ రావాలి? ఒక్క Consulting కే యీయన 50/- తీసుకుంటారే !

శేఖ- యాభయ్యా ?



వెంక– అవునండి! అందరూ యిచ్చుకోగలరా? యిచ్చుకునే శక్తి ఉన్నవాళ్ళకేనా రోగాలు వస్తాయి?... ఏమిటో భ్రమ సార్! అనుభవంతో తల నెరిసిపోయి పిల్లా పిచికల్తో యీాదులాడుతున్న మాలాంటివాళ్ళకి ఒక్క అణా యివ్వడానికి గుణుస్తారు సార్! ఎవరు మందిస్తే నేం? రోగం నయంకావాలి గాని! ...నా మాట విని నేను చూస్తాను చెప్పండి మీా సంశయం ఏమిటో! మంచి మందులే యిస్తాను సార్! మా డాక్టరుగారు వాడినవే!

శేఖ– ప్రస్తుతం నా కేమీా మందు లక్కర్లేదు.

వెంక– ఏదో సందేహం ఉందన్నారే?

శేఖ– అది డాక్టరుగారితో మాట్లాడవలసిన విషయం.

వెంక– ఒక్క డాక్టరుగార్తోనేనా సార్? సరేలెండి. అదో వచ్చేశారు డాక్టరుగారు. సార్! అవసరం రాదన కండి. వస్తే మాత్రం యీా వెంకటనారాయణ నిమరచి పోవద్దు సార్!

(వెంకటనారాయణ ద్వారంవైపు వెళ్తాడు. డాక్టరు లోనికి వస్తూ **Hat** తీసి వెంకటనారాయణ కిస్తాడు. వెంకటనారాయణ లోనికి వెళ్ళబోతుంటే)

డాక్టర్- నారాయణా !

వెంక- (ఆగి) సార్ !

డాక్టర్- కారులో **Bag** వుంది...

వెంక-తీసుకొస్తా సార్ ! (అని కుడిద్వారంలోనించి వెళ్తాడు టోపీ Hanger లో పెట్టి)

డాక్టర్- (నిలుచున్న శేఖరంతో) కూర్చో నాయనా ! కూర్చో. ఒక్క నిముషం ! (అని కోటు విప్పి Fan on చేస్తాడు కుర్చీలో కూర్చుని) ఆ ! ఏమిటి నాయనా ! ఏం కావాలి ?

శేఖ- ఏమీ లేదండీ ! ఒక చిన్న విషయంలో...

డాక్టర్- ముందు నీ పేరేమిటో చెప్పావుకావు...

శేఖ- రాజశేఖరరావు. అని...

డాక్టర్- యీ ఊరేనా ?

శేఖ- కాదండీ !

డాక్టర్- సరే - ఊరు కేమొచ్చింది ... ఏమిటా చిన్నవిషయం ? (శేఖరం సంకోచిస్తుంటాడు) యిదుగో అనుమానం వద్దు. సంకోచం పడకూడనిచోట్లలో యిదొకటి. అందులో

డాక్టరు ముందర అభిమానం అనుమానం రెండూ పనికిరావు.

శేఖ- అభిమానం కాదండీ.

డాక్ట- అనుమానం కూడ అనవసరం అన్నాను కదా! ఏమి టా విషయం?

శేఖ- విషయం ఏమీ లేదనుకోండి.

డాక్ట- మరి?

శేఖ- క్షమించాలి ... ఎలా చెప్పడమో తెలియడంలేదు. శ్రమ యిస్తున్నానని...

డాక్ట- శ్రమకేంలే! తాపీగానే చెప్పు. తొందర లేదు.

శేఖ- డాక్టరుగారూ! నేను (సంకోచిస్తూనే) నేనొక అమ్మాయిని ప్రేమిస్తున్నానండీ!

డాక్ట- (తెల్లముఖం వేసి) ఆ!...అయితే యిక్కడికి రావలసిన అవసరం ఏముంది? (స్థిమితపడి తడబడే శేఖరంని చూచి) అబ్బాయీ! ప్రేమించడం ప్రకృతి సహజం! ప్రేమ ప్రేమ లేనిది జీవించడంలో అర్థంలేదు! నా దృష్టిలో ప్రేమ నెరుగని బ్రతుకు బ్రతకడంలో ప్రయోజనం లేదు.

## అనుమానం



శేఖ- నిజం చెప్పారు డాక్టరుగారూ! నేను నా సర్వస్వం ఆ అమ్మాయనే భావిస్తున్నాను. ఆమెను నా ప్రాణాం కంటే మిన్నగా ప్రేమిస్తున్నాను.

డాక్ట- అధికస్య అధిక ఫలం నాయనా! యింతకీ ఆ పిల్ల నిన్ను ప్రేమించడం లేదా?

శేఖ- ప్రేమిస్తున్నది డాక్టరుగారూ! ఒక్క క్షణం నన్ను విడిచి ఒంటిగా బ్రతుకలేని ప్రేమ ఆ అమ్మాయికి నా మీద.

డా- మరింకేం? తొలివసంతంలో ఉన్నావ్ ఆరోగ్యవంతుడివి! అదృష్టవంతుడవి.

శేఖ- అది కాదండీ!

డా- మరి?

శేఖ- పెళ్ళిచేశేసుకుందాం అని తొందరపెడ్తున్నదండీ!

డా- (సంశయంతో) ఆ! అలాగా? నీకు యిష్టం లేదా?

శేఖ- నా యిష్టం మాట కాదండీ.

డా- అహా! అయితే మీ తలిదండ్రులకి మీ సంబంధం యిష్టం లేదన్నమాట.

శేఖ- అబ్బే! అది కాదండీ! వాళ్లకి మేం పెళ్ళి చేస్కోడం అంగీకారమేనండీ! వాళ్ళ ఆటంకం యీ విషయంలో ఏమీ లేదండీ.

డాక్టరు- మరింకేం ? యింకెందుకు సంశయం ? యింకెందుకు ఆలశ్యం ! కానీయండి. కానీయండి. త్వరగా పూర్తవనీయండి. అబ్బాయీ ! ఒక్క మాట మరచిపోవద్దు. యీ రోజు జారిపోతే మనకోసం మళ్ళీ తిరిగిరాదు వసంతం ఏడాదిలో ఒక్కసారే వొచ్చి పోతుంది. ఆ అమూల్య కాలాన్ని అనుమానాల్లో, ఆలోచనల్తో సందేహాల్తో సంకోచాల్తో వ్యర్థం చెయ్యకండి. మా వలె ముసలులయిపోయిన తర్వాత తాపీగా ఆలోచిస్తూ విచారిస్తూ ఒక మూల కూర్చోడానికి కావలసినంత ఓపికా వ్యవధీ ఉంది. ముందు వేగం వెళ్ళి ఆ పిల్లని పెళ్లి చేసేసుకో. యిందుకోసం డాక్టరు దగ్గరకా రావడం పిచ్చివాడా ! పురోహితుడి దగ్గిరికి వెళ్లాలి ! వెళ్ళు ! లే !... వెళ్లి త్వరగా ముహూర్తం పెట్టించుకో.

శేఖ- నిజమే !... కానీ (సందేహంతో గుటకలు వేస్తాడు)

డాక్ట- అలా సందేహిస్తావేం ? ఏమిటి నీ అనుమానం ? యింకా నీ కేమిటి కావాలోయ్ ? ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తూ వుంది. నీవూ ఆ అమ్మాయిని ప్రేమిస్తు న్నావ్. మీ యిద్దరి అనురాగాన్ని మీ పెద్దలు అంగీకరించి ఆశీర్వదించారంటున్నావ్ ! యింకా ఏమిటి కావాలి ?

శేఖ- నిజమే! మీరన్నదంతా నిజమే! కాని... కానీ... మా వివాహానికి ముందు...

డాక్ట- ఆగిపోయావేం? ...'ఆ! చెప్పూ! వివాహానికి ముందు... అలా సిగ్గుపడతావేంటి?... చెప్పూ?

శేఖ- (జంకుతూ) మా వివాహానికి ముందు... ఒకసారి నా ఒళ్ళు పరీక్ష చేయించుకోవాలనుకుంటున్నా సార్!

డాక్ట- (ఆశ్చర్యంతో విభ్రాంతు డౌతాడు. ఆశ్చర్యం చిఱునవ్వుగా మారి, చిఱునవ్వు వికావికలై పెద్దనవ్వుగా మార్తుంది.)

భేష్! భేష్! పెళ్ళికి ముందు ఒళ్ళు పరీక్ష చెయ్యించుకోవాలనుకుంటావా? గొప్ప ఆలోచనే! నాకు నచ్చిన మాట చెప్పావ్!... కడుపుకోసం, కష్టించే ఉద్యోగంకే ఒళ్ళు పరీక్ష చెయ్యించుకుంటారే! తరతరాల వంశాన్ని నిలిపేవివాహానికి ఎందుకు కూడదు?జీవితంలో అతిముఖ్యమైన ఘట్టంగా వివాహం?

శేఖ- మీరు హాస్యమాడ్తున్నారు నాతో!

డాక్ట- హాస్యంకాదు నాయనా! నువ్వు చెప్పింది ఆలోచించవలసిన అమూల్య సత్యం. అమాంతం శ్రద్ధ మన



పెద్దలు తీసుకోనుంటే మన జాతి యీనాడు యింత నిర్వీర్యంగా తయారై వుండేవా ?... యీ రోగ లిలా ప్రజల్లో చెలరేగుతుండేవా? ఈ గృహావిచ్ఛిన్నాలూ, కలతలూ, కల్లోలాలూ యింటింటా వుండేవా? అందరిముఖాల్లో ఆరోగ్యం వికసి ఆనందంతో వెలిగి నీవంటి బలవంతులతో దేశం కలకల్లాడుతూ వుండేది, మా డాక్టర్లకి కొంత శ్రమ తగ్గిఉండేది.

శేఖ- అది కాదండీ! నే చెప్తున్నది నా స్వంతవిషయం దేశం విషయం కాదు డాక్టర్ గారూ!

డాక్ట- ఏది కానీ! ఆలోచనలు రేగి ఆదర్శం కనిపిస్తున్నది. నువ్వు చెప్పినవిషయంలో—నిన్ను చూస్తే సీకూ రోగాలకీ బద్ధవైరం వున్నట్టు డాక్టర్నైన నాకే అనిపిస్తూ వుందే... మరి నీ కెందుకు పరీక్ష చేసుకోవాలనే అభిలాష కలిగిందో.

శేఖ- చూశారూ మీ రన్నట్టు వివాహం మా ఒక్కరి జీవితాలతో సరిపోదు. గతం అక్కర్లేకపోయినా భవిష్యత్తంతా యేమీ చికాకులు అవాంతరాలు లేకుండా వుంటే అంతే చాలు.

అనుమానం 



డాక్ట- ఔనవును! వివాహంయొక్క ఆవశ్యం దేశానికీ సంసంఘానికీ ఉత్తమ వారసులను యివ్వడమే?

శేఖ- అదేమిటండీ! అలా అంటారేమిటీ?

డాక్ట- అవును బాబూ! వివాహాలమూలంగా కలిగే సంతానం ఉత్తమసంతానంగాఉంటే సంఘానికీ దేశానికి యెంత ప్రయోజనమో నీకుచెప్పాలా? సరే దాపకేం నీసంకోచం అర్థమైనది. చిల్లరపోకిళ్ళు పోయినప్పుడు కాస్త జాగ్రత్తా, సావధానతా అవసరంనాయనా! అప్పటికీ ఉడుకురక్తం గనుక పొరపాట్లు జరుస్తునే వుంటాయిలే.

శేఖ- (అసహ్యంతో) ఛీ! ఛీ! అల్లాంటిదేమీ కాదండీ! మీరు సరిగ్గా నన్ను అర్థంచేసుకోలేదు డాక్టరుగారూ!

డాక్ట- అంటే అపార్థంచేసుకున్నాననా నీఅర్థం!

శేఖ- మీరు నాఒళ్ళు పరీక్షచేసి, అతరువాత మీరు మనస్ఫూర్తిగా 'పెళ్ళిచేసుకోవచ్చు'నని సలహాయిస్తే...

డాక్ట- పెళ్ళిచేసుకుంటావా? ... సరే! బావుంది. నాదేంపోయింది? నీమనస్సులో ఏదో అనుమానం ఉన్నట్టుంది. తప్పకుండా Examine చేస్తా... ఫీజు రూ 50/- ముందుగానే చెల్లించాలి... (లేచి) వెంకటనారాయణా...

వెంక- (లోనుంచివస్తూ) సార్!

డాక్ట- యితన్ని లోనికి తీస్కెళ్ళు!

(శేఖరం లేచి పదిలూ పాయలనోట్లు ఆయిగు పర్సులోనుంచి తీసి టేబిలుమీద పెట్టి వెంకటనారాయణతో ఎడమవైపు లోనికి వెళ్తుంటే టెలిఫోన్ మోగుతుంది. డాక్టర్ Receiver తీస్తాడు)

డాక్ట- (ఫోన్లో) హల్లో! ఓహో! సీతరామయ్యా! ఎప్పు డొచ్చావ్! ఆ!...యిదిబావుందీ? ... యిప్పుడా ఫోన్ చెయ్యడం? ... ఆ! ... సరేలే! యిక్కడేవుంటాను. ఆ! ఆ! అమ్మాయినీ తీసుకురావోయ్! మీకోసం చూస్తుం టాను!

వెంక- (తిరిగివొచ్చి) స్టౌవ్ వెలిగించాలాసార్? ...

డాక్ట- (లోనికి వెళ్ళబోతూ) అక్కర్లేదు ... ఆ! వెంకటనారా యణా! సీతరామయ్య వొస్తున్నానని ఫోన్ చేశాడు! వస్తే కూర్చోబ్బమని చెప్పు. యీ కేసు కొంచెం చూసి వస్తున్నా.

వెంక- Yes Sir! (డాక్టర్ లోనికి వెళ్తాడు. వెంకటనారాయణ టేబిలు మీద నోట్లు తీసి డ్రాయర్ లో పెడుతూ) లోకంలో న్యాయం యిదే! స్థిరమైన ధర యేదీ లేదు! అనుభవంకి విలువ లేదు! తల నెరిసినా నాబోటివాడితో ఉపకారం పొందు

[3



దామనేతప్ప, టీనీళ్ళకి ఒక్క అణా యివ్వడానికి సంకోచిస్తారు, పిల్లలుగలవాణ్ణని తెలిసి కూడా (కుడిద్వారంలో కనిపించిన గోపాలంని చూచి) ఏం సార్? మళ్ళీ వచ్చారే.?

గోపా- (గాభరాతో) బాబయ్యొచ్చారా?

వెంక- వొచ్చారుసార్! లోపల వున్నారు...ఆ...అన్నట్టు... (జేబులో చెయిపెట్టాడు)

గోపా- యిక్కడ నాకాగితాలు వదిలేశానా?... (వెంకటనారాయణ తన జేబులోనుంచి గళ్ళకాగితాలు తీస్తాడు) ఆ! అవిగో! అవే! అబ్బ ప్రాణాలుపోయాయి! ఎక్కడపారేశానో అని గుండెలు జారిపోయాయి.

వెంక- యిక్కడ ఏమీ పోవడానికి వీలులేదుసార్! అన్నీ జాగ్రత్తగా ఇస్తానుసార్.

గోపా- యీవాళే ఆఖరురోజు తెలుసా పంపడానికి యిది ఒక శుభశకునమేమో, యీరోజు దాటిపోతే యివి యెందుకూ పనికిరావు...వస్తాను. యింకా పోస్టాఫీసుకు (అని ఆపేపర్లు తీసుకొని తొందరగా వెళ్ళిపోతాడు లోనుంచి డాక్టరు చేతులు తుడుచుకుంటూ ప్రవేశిస్తాడు. ముఖం చాలా సీరియస్‌గా వుంటుంది. ఆతని వెనుకనే ఈల్చి తోడుక్కొంటూ శేఖరం వస్తాడు. క్షణం నిశ్శబ్దం. వెంకటనారాయణ లోనికి వెళ్తాడు. శేఖరం ముఖంలో ఆతృత, సంశయం భయం, బాధా కనిపిస్తుంటాయి.)

అనుమానం.



శేఖ- (ఆతృతతో) డాక్టరుగారూ! ఏమి టిదీ? ఏమి టిలా ఊరుకున్నారు? ఏమీ చెప్పరేం? ఏమి టాలోచి చిస్తున్నారు?

డాక్టర్- (ఆలోచిస్తూనే వుంటాడు సీరియస్‌గా)

శేఖ- (వొణికేస్వరంతో) డాక్టరుగారూ!... చెప్పండి! మీ అభిప్రాయం చెప్పండి! (దగ్గరికి వెళ్లి భుజంమీద చెయ్యి వేసి ఊపుతూ) ఏమిటాలోచిస్తున్నారు? ఏమిటి మీ సందేహం? చెప్పరేం? చెప్పండీ!

డాక్ట- (తాపీగా) ఏమిటి చెప్పేది?

శేఖ- ఏమిటా? బావుంది! నన్ను పరీక్షచేశారు? మీతీరు చూస్తుంటే నాకు భయం వేస్తోంది! చెప్పండీ! ఏమిటి మీరు కనిపెట్టారో చెప్పరూ? ఏదో వెంటనే చెప్పి తేల్చివేయండి! నన్ను యీ సందిగ్ధంలో పెట్టి చంపకండి. మీ కాళ్ళు పట్టుకుంటాను మీ అభిప్రాయం చెప్పండి!

డాక్ట- ఎందు కంత గాభరా పడ్తావ్? అలా కూర్చో! అధైర్యపడ్తే ఎలా?

శేఖ- అధైర్యమా? నాకు తెలుసు మీరేమి చెప్తారో! యిక నా బ్రతుకంతా నరకమేనా? ఎందు కాలశ్యం చేస్తూ నన్ను చంపుతారు? చెప్పండి! నా దురదృష్టాన్ని (ముఖం కప్పుకుంటాడు)

అనుమానం 



డాక్టర్- యిటుచూడూ!...ముందు నేనడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పు!...తర్వాత...

సేఖ- మీరు ప్రశ్నలు అడగడానికి యిదేనా సమయం? మీకు సమాధానా లిచ్చే స్థితిలో ఉన్నానా?... డాక్టరుగారూ! నన్ను వేధించకండి. ముందు నా ప్రార్థనకి సమాధానం యివ్వండి. మీ ప్రశ్నలు తర్వాత వేద్దురుగాని... చెప్పండి! నా స్థితి నాకు చెప్పండి. డాక్టరుగారూ! మాట్లాడరేం? ... మీకు పుణ్యం ముంటుంది చెప్పండి!

డాక్టర్- స్థిమితపడూ! నువ్విలా దిగులుపడితే ఎలా అబ్బాయ్! చెప్తానన్నాగా, ధైర్యం తెచ్చుకో...

శేఖ- డాక్టర్ గారూ! మీకు హృదయం లేదు. కనికరం లేదు, మీ ఒక్క మాటమీద నా జీవితం నిలిచిఉందని తెలిసీ మీరిలా ఆటలాడిస్తారేం! మీ ఒక్క మాటతో నా ఆశలూ, కలలూ, నా జీవితంలోని ఆనందం, ఆశయం అంతా ఎగిరిపోతాయని తెలిసీ ఎలా స్థిమితపడటం? ఎలా ధైర్యం తెచ్చుకోవడం? నేను రాతిని కానే! డాక్టర్ గారూ! చెప్పండి, చెప్పండి! ఆలశ్యం చెయ్యకండి!

డాక్టర్- అబ్బాయ్! నీ విషయంలో ఖచ్చితంగా నా అభిప్రాయం చెప్పేముందు, నేను యింకో మంచి డాక్టరుతో సంప్రదించాల్సిన అవసరం వుందని నా కనిపిస్తోంది అందుకని తొందరపడి...

శేఖ- తొందర ... తొందర ... తొందరపడకుండా ఒక్క డాక్టర్తో కాదు ... లక్షమందితో సంప్రదించుకోండి. ముందు నాకీ మాట మాత్రం చెప్పండి. నేను పెళ్ళి చేస్కోవచ్చా?

డాక్టర్- ఆ...ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నానన్నావ్ కదూ?

శేఖ- నా ప్రాణాలకంటే మిన్నగా ప్రేమిస్తున్నాను డాక్టర్ గారూ!

డాక్టర్- ఆ అమ్మాయి జీవితాన్ని ఆనందమయంగా సౌఖ్యవంతంగా చెయ్యాలనేభావన ఉందా నీకు?

శేఖ- అందుకై నా ప్రాణాలను కూడ నవ్వుతూ బలి యివ్వడానికి సిద్ధంగా ఉన్నాను డాక్టర్గారూ! హేమ ఆనందంకంటే నాకీ ప్రపంచంలో విలువైనదేదీ లేదు.

డాక్టర్- ఆ మాటలమీద నిలబడవలసిన అవసరం వుంది నీకు... ఆ అమ్మాయి జీవితం దుఃఖమయం కాకుండా వుండడానికి యీ వివాహం...

శేఖ- ఆ!...

## అనుమానం



డాక్టర్- ... చేసుకోకూడదు.

శేఖ- (అర్థం కానట్టు చూస్తూ) ఆ! ఏమిటి?

డాక్టర్- అబ్బాయీ! యిలా కుమిలిపోతే ప్రయోజనం లేదు. ఇది నీవు తట్టుకోలేని అఘాతమే! నిజంగా నీకిది నిరాశ కలిగిస్తుంది! అదే నా భయం కూడా! కూర్చో అలా ఆ కుర్చీలో కూర్చో! (శేఖరం దీనంగా కన్నీరు జారుతుంటే కుర్చీలో కూలబడ్తాడు) చూడూ! నిజం చెప్పమని నువ్వే నిర్బంధం చేశావ్. డాక్టరుగా నేను అబద్ధం చెప్పలేను... పెళ్ళికిముందే నువ్విలా కావడం యీపరీక్ష చేసుకోవడం చాలా మంచిపనిచేసావ్!... అంతా అయిపోయింతర్వాత ఎంతవిచారించీ ప్రయోజనం లేకపోయేది! నామాటలు బాగా అర్థంచేసుకో!

శేఖ- డాక్టరుగారూ! నేను పెళ్ళిచేసుకో కూడదా?...నిజం చెప్పండి! ... పర్వాలేదు... నేనేమీ బాధపడను... చెప్పండి!

డాక్టర్- ఆ అమ్మాయి నాకూతురే అయితే ... మీయిద్దరిలో ఎంత అన్యోన్యమైన అనురాగం వున్నాసరే మీ వివాహానికి నేను సమ్మతించలేను...అలా సమ్మతించి ఆ పిల్ల బ్రతుకు నాశనం చెయ్యలేను ... మీకు పుట్టిన పిల్లలకూ, మీ వంశం, వంశం అంతటికి నేను తెలిసి తెలిసి ద్రోహంచేసినట్టు భావిస్తాను మీపెళ్లికి అంగీకరిస్తే...

[4



శేఖ- మీరనేది నిజమేనా డాక్టరుగారూ!

డాక్ట- యీ గుండెజబ్బు విషయంలో నీకూ ఏదో కొంచెం అనుమానం ఉండేదనుకుంటాను!

శేఖ- ఔను! మానాన్నగారు గుండెజబ్బుతోనే చనిపోయారు యీమధ్య రెండు మూడుసార్లు నాకూ గుండెలో పోటు పుట్టింది.

డాక్ట- యీ సంగతి నీవు పెళ్ళాడాలనుకుంటున్న ఆ అమ్మాయికి తెలుసా?

శేఖ- ఉహూ తెలీదు... నేను చెప్పలేదు!

డాక్ట- (ఆలోచిస్తూ) అయినా... యీ విషయంలో నేను యింకొక స్పెషలిస్టు అభిప్రాయంకూడా తీసుకోడం మంచిదనిపిస్తూంది. సర్జన్ శంకరరావ్ తెలుసా? ... చాలా తెలివైనవారులే! ఉత్తరం వ్రాసిస్తా. వెళ్ళి ఒకసారి సంప్రదించు! (ఉత్తరం వ్రాస్తుంటాడు.)

శేఖ- డాక్టరుగారూ! ఎందుకు వృధా ప్రయాస! మీకు తెలియనిది ఆతనికి మాత్రం...

డాక్ట- అదికాదబ్బాయ్! అనుమాన నివృత్తికోసం... వెళ్ళడమే మంచిది... (ఉత్తరం యిస్తాడు.)

శేఖ- డాక్టరుగారూ! యీజబ్బుకి మందులేదా? ఎంతఖర్చయినా పరవాలేదు! తగినమందుంటే...



డాక్టర్- నాయనా! నీబాధ నాకర్థంకాలేదనుకోవద్దు. నాకు అలవికానివి చేస్తానని ఆశలుచూపడం నామతానికి వ్యతిరేకం!

శేఖ- యీ జబ్బు కుదరనేకుదరదా?...దీనికి బలిఅవడానికే నేను బ్రతికివున్నాను? దీనిమూలాన్న నాలోని ఆశలన్నీ నేలపాలవ్వాలా? దీనికోసం... (ఉక్కిరి బిక్కిరయి పోతాడు.)

డాక్టర్- ఛీ! ఛీ! అలా అయిపోతున్నావేం?...ఏమో ... నేను పొరపడినానేమో...నిర్ధారణగా నేను మాత్రం ఎలా చెప్పగలను? అదృష్టం వుంటే...

శేఖ- (తేరుకొని) డాక్టరుగారూ! మాటల్తో ఎందుకు మభ్యపరుస్తారు? యింతకీ తేల్చిన సారాంశం నేనింతగా కోరి ఆశించే యీ వివాహం చేసుకునే అదృష్టం నాకుదుట లేదు!... నేను పెళ్ళాడలేను!...

డాక్టర్- ఆహా! పెళ్ళాడలేవనికాదు ... పెళ్ళాడకూడదు ... అయినా ఆమాట అప్పుడే ఎందుకనాలి?...శంకరావు గారితో కలసి మాట్లాడు. ఆయన యిల్లాంటి కేసులలో ఉద్దండుడు!

శేఖ- (లేస్తూ) సరే! మీమాటే కానివ్వండి! యిప్పుడే ఆతనితో కలుస్తా! అదృష్టం నడిఆకాశంలో ఊగులాడుతూండడం కంటే అటో ఇటో తేల్చుకోవడమే ఉత్తమం!

అనుపానం

డాక్టర్- (లేచి) ధైర్యం విడిచిపెట్టకు! చివరంటా ప్రయత్నం చెయ్యడం మన ధర్మం!

శేఖ- అవును! భయపడిమాత్రం ఏంలాభం?... యీ జబ్బు మానాన్నగారికి వున్నట్టిదే అయితే... కళ్ళారా మా నాన్నగారి చావుచూశాను ... కుర్చీలో కూర్చొని నాతో మాట్లాడుతునే అలా గుండె పట్టుకొని జేరగిల బడి నిద్రపోయారు... అంతే ... చావు "వస్తున్నా" నన్న సూచనకూడ చూపించకుండా మింగేసింది... క్షమించండి. మీకు చాలా శ్రమ కలిగించేను. వొస్తా (తొందరగా నిష్క్రమిస్తాడు.)

డాక్టర్- (వెళిపోతున్న శేఖరంని విచారంతో చూస్తూ నిట్టూర్చి కుర్చీలో కూలబడి) వెంకటనారాయణా!

వెంక- (ప్రవేశించి) Yes Sir ... ఆయన వెళ్లిపోయారా సార్? ఏం సార్ అలా వున్నారు?...

డాక్టర్- వెంకటనారాయణా!... దేవుడంటూ ఒకడుంటే అతనికి న్యాయాన్యాయ విచక్షణ వుందా అని...

వెంక- అయ్యొయ్యో! దైవదూషణ చెయ్యకండి సార్!

డాక్టర్- హుఁ! పాపం! ... వెంకటనారాయణా! ఒకటడుగుతా చెప్పూ?... ఆకుర్రవాడు నీతో మాటాడుతూ, నీకళ్ల ముందే అలా కూలబడి ప్రాణాలు విడిచిపెడ్తే... నీకెలా వుంటుంది?

అనుమానం



వెంక- యిప్పుడొచ్చినతనా సార్?...

డాక్ట- ఆ!

వెంక- ఏజన్మలోనో చేసిన కర్మఫలం సార్! అంతకంటె యింకేముంది?

డాక్ట- కర్మ! ... తలిదండ్రుల తెలివితక్కువతనం! వాళ్ళ మూర్ఖత్వానికి, బిడ్డలు బలి అవడం!...

వెంక- యెన్నిచెప్పండిసార్! విధివిధానాన్ని ఎవ్వరూ తప్పించలేరు సార్!

డాక్ట- విధి, కర్మ! ..అంటూ తృప్తిపడి వుండకుండా మనిషి ప్రయత్నంచేస్తూ అవస్థపడడం ఎందుకూ?

వెంక- పెద్దవాణ్ని సార్! తల నెరిసిపోయింది అనుభవాల్లో! నాకు తెలిసినదీ... నేను నమ్మినదీ యిది ... బంగారం పళ్ళెమైనాసరే గోడచేరుపు నుండాలి. మీరే చెప్పండి మనం యిచ్చే ఆమందులే కొందరికి వుపయోగపడీ కొందరికి వుపయోగంలేకుండా పోతున్నాయెందుకు? అంతా ఆదేవుని లీలసార్! మనం నిమిత్తమాత్రులం పాపం ఆ అబ్బాయికి అంతప్రమాదమైన జబ్బుందా సార్? ఏమిటి Prescribe చేశారుసార్?

డాక్టర్- నేనెరిగినంత మట్టుకు ఆ జబ్బుకి మందు లేదు!

వెంక- పాపం! అయితే ఏమవుతుందిసార్?...

డాక్టర్- ఏమవుతుంది?... నువ్వన్నట్టు ఆ భగవంతుడే అడ్డుపడి కాపాడాలి!...యిట్లాంటివి చూస్తుంటే ఒక్కొక్కప్పుడు యీ మందులమీదా, యీ చదువూ, విజ్ఞానం మీదా మన బ్రతుకూ, మన అనుభవంమీద అపనమ్మకం కలుగుతుంటుంది.

వెంక- అబ్బెబ్బే! అలా అంటే ఎలాసార్? ... ఎవరిపనివారు చేస్తూవుండాలిసార్! ...యిల్లాంటి విచిత్రాలు చూస్తుంటేనే భగవంతునిమీద నమ్మకం పుడ్తుంది మనశక్తీ, మన విజ్ఞానం, మన ఆలోచనా మన అనుభవం ఎందుకూ పనికిరానప్పుడే ఆ మానవాతీతమైన శక్తిమీద నమ్మకం కలుగుతుందిసార్!

డాక్టర్- నమ్మకమో అపనమ్మకమో! పాపం! పెద్దకుటుంబంలో పుట్టినట్టున్నాడు ... ఆరోగ్యం, ఐశ్వర్యం, అందం... అన్నిటికన్నా మంచి యౌవనంలో ఉన్నాడు. ఏమిటి లోటుంది చెప్పూ ...నన్ను బాధించేదేమంటే యీ సమయంలోనే అతని కలలు కూలి ధూళిపాలవడం...

వెంక- ఏం కలలు సార్?

## అనుమానం

డాక్టర్- ప్రేమించిన పిల్లను పెళ్ళిచేసుకోలేకపోవడం...

వెంక- పాపం! అనుభవించే యోగం లేదేమో!...

అసలు జబ్బేమిటిసార్?

డాక్టర్- జబ్బా!...హృదయకోశం పూర్తిగా చెడిపోయింది. రక్తాన్ని శుభ్రించేసే శక్తికూడ వున్నట్టులేదు. యింత కొండంత మనిషీ ఏక్షణాన కూలిపోతాడో చెప్పటం కష్టం!

వెంక- నాకంటికి ఆరోగ్యంగానే కనిపించాడే!

డాక్టర్- నన్నడిగితే అంత ఆరోగ్యంగా ఉండడం మూలాన్నే యింతకాలం తోసుకు రాగలిగాడు. మనలాంటి మామూళ్ళు శరీరారోగ్యం అయ్యుంటే ఏనాడో అతని చరిత్ర పూర్తయ్యేది!

వెంక- అయితే మీరేమి సలహాయిచ్చారు సార్?

డాక్టర్- పెళ్ళిచేసుకోవద్దన్నాను ... ఎలా చేసుకోమని చెప్ప గలను?...నిజానికి అలా చెప్పడానికి మనసొప్పలేదు... కానీ - గత్యంతరంలేదే! అయినా నిర్ణయభారం అతని మీదే విడిచిపెట్టాను.

వెంక- ఏం నిర్ణయం సార్?

డాక్టర్- ఆ అమ్మాయి సుఖం, ఆనందం అనుభవించాలంటే తను పెళ్ళిప్రయత్నం మానుకోమన్నాను. అది వంశానుగతంగా వస్తున్న జబ్బు! చాలా ప్రమాదకరమైనది... ఏక్షణంలో గుండె ఆగిపోయినా ఆగిపోతుంది.

వెంక- మందు ఏమైనా తీసోకమన్నారా?

డాక్టర్- మందా? ఆ జబ్బుకా?...

వెంక- పాపం! యింతలోనే నూరేళ్ళు నిండిపోయాయా సార్. మీరు తొందరపడి యీ విషయం అతనితో చెప్పడం మంచిదికాదేమోసార్?

డాక్టర్- నేనేమిచేసేది... చెప్తావా చస్తావా అని గొంతుకమీద కూర్చుంటే... అందులో నామాటమీద ఆ పెళ్ళి నిశ్చయం ఒకటుందన్నాడు...

వెంక- అందుకని అసలు ప్రయత్నించకుండానే మీరు నిర్ధారణగా చెప్పడం...

డాక్టర్- తలవెంట్రుకవాసి ఆశఉన్నా నేను విడచి పెడ్తానా వెంకటనారాయణా?

వెంక- అయితే ఏంచెయ్యడం సార్?

డాక్టర్- నీవన్నట్టు ఏంజరుగుతుందో జరగనీ అని కూర్చోవడమే!

వెంక- (వీధిలోనికి చూసి) అదుగోసార్! సీతారామయ్యగారు!... అమ్మాయిగారూ వొచ్చారండీ!

## అనుమానం



డాక్ట- (లేచి ద్వారంవైపువెళ్ళి) రండి రండి! మీకోసమే చూస్తు న్నాను. (సీతారామయ్య హేమలత ప్రవేశిస్తారు. సీతారామయ్యా శ్రీనివాసరావూ అప్యాయంగా భుజాలు కలుపుకొని చేతులు పట్టుకుంటారు)

సీతా- ఎన్నాళ్ళకి...ఎన్నాళ్ళకి! అరే! నువ్వేం మారినట్లే లేదే!...

డాక్ట- కూర్చో అమ్మా! పెద్దదానివయిపోయావే! (హేమ కూర్చోబోతుంది) ఏంవయ్యా! ఒంట్లో కులాసాయేనా?

సీతా- నీకలవాటయిపోయిందదీ!...డాక్టరువికదూ... వొంట్లో ఎలావుందో నీతో చెప్పితీరాలి! ఏం? నువ్వేమీ చెక్కు చెదరనట్టున్నావే! చెప్పవయ్యా ఆమందేదో నేనూ వాడ్తాను! ... అమ్మాయీ! హేమా! మాయిద్దర్నీ చూచి మీ బాబాయ్ కంటే నేను ఏడేళ్ళు చిన్నవాణ్ణనని ఎవ్వరైనా చెప్పగలరూ? ... ఏంవోయ్ వెంకట నారాయణా! క్షేమమేనా? నువ్వూ నీకుటుంబమూ?

వెంక- తమదయవల్ల క్షేమమే సార్!

సీతా- యీ ఆరేళ్ళలో యింకేమయినా మీయింట్లో...

వెంక- చిత్తం! చిత్తం! యింకొక నలుగురుసార్! కూతుర్లే!

సీత- అంటే మొత్తం డజనునుకుంటాను!

వెంక- లేదుసార్! ఒక్కటి తక్కువ! పదకొండుమందే... కూతుర్లు!

[5

సీతా- కూతుర్లవనీ కొడుకులననీ కన్నతరువాత మన చేతిలో ఏమీలేదు! ఆ మిగిలినదొక్కటీ పూర్తి చెయ్యి...ఏమో రోజులు మారిపోతున్నాయి. ఆడవాళ్ళకీ మనలాగే ఓట్లు ఆస్థుల్లో హక్కులూ వొచ్చాయిగా...

డాక్ట- చాల్లే! అతన్నేడిపించకూ!

సీతా- ఏడిపించడమా?...అతన్ని చూసి కూడా నీకు బుద్ధి రాలేదే అని నాయేడుపు! ఎందుకు చెప్పాు నీ ఒంటరి జీవితం?...పెళ్ళి పెడాకులు లేకుండా బెండకాయలా తయారయ్యావ్! నిన్నో యింటివాడిగా చూచే అదృష్టం మాకు లేకపోయింది!

డాక్ట- సీతారాం! యింకా నీకు పరాసికాలేనా? పెళ్ళికి ఒక వయసంటూ, ఒక యోగ్యతంటూ ఉంది తెలుసా? కాటికేపాక అడుగు వేస్తూ యిప్పుడు నేను పెళ్ళాన్నేం చేసోక్కను?

హేమ- నాన్నా! మీరే అన్నారుగా! బాబయ్యకి రోగాలకి ఆదిలోనే పెళ్ళయిపోయిందని...

డాక్ట- నిజమేనమ్మా!...కానీ మహా గయ్యాళి పెళ్ళాం సుమా అది!...దాని పాదాలముందు ఒక్కొక్కసారి సలాం చెయ్యాల్సొస్తుంది. యింతకీ నీ పెళ్ళికి పిలుపెప్పుడొస్తుందో చెప్పలేదే!

## అనుమానం

సీతా- అ కందుకేనోయ్ యిప్పుడు రావడం!

డాక్ట- ఏమిటీ?...నిజమే. .ఎక్కడ చూశావు సమ్మంధాన్ని?... వరుడూ...

సీతా- వెర్రివాడా! నువ్వింకా మన రోజులలోనే ఉంటున్న ట్టుంది! యీరోజుల్లో పెద్దవాళ్ళు చూచిన సమ్మంధాలు వీళ్ళకి నచ్చుతాయనేనా నీ అభిప్రాయం?

హేమ- చాల్లేనాన్నా! మీరు మరీను ... మీమాటలు విని, మీరంటే నాకు లక్ష్యం లేదనుకోగలరేవన్నా.

డాక్ట- ఎవరా కుర్రవాడు? ఏవూరు?

సీతా- నన్నేమీ అడగవద్దూ! దీన్నే అడుగు! ప్రేమట! అదే మిటోఅట అదేంటోఅట! నాకు అర్ధమయి ఏడిస్తేనా?... నేనొప్పుకోవాలన్నారు! వాళ్ళిద్దరి ముఖాలు చూసి కాదనలేకపోయాను. పొరపాటున వీలులేదని అన్నానా యిది పురిపెట్టుకుంటుందనీ - వాడు పిచ్చెత్తి వీధుల్లో తిరుగుతాడనీ భయంవేసింది - నాకెందుకా పాపం మధ్య! అంచేత ఏలా ఏడుస్తారో ఏడవండి అని ఓ నమస్కారం పెట్టాశాను!

హేమ- లేదు బాబయ్యా! అన్నీ అబద్ధాలే నాన్నే స్వయంగా అల్లుణ్ణి వెతికి తీసుకొచ్చారు!

సీతా- అవునవును! నేను పెళ్ళాడ్డామని...

డాక్టర్- నిజానికంతేగా. అల్లుడంటే మామగారికి
హేమ- బావుంది బాబయ్యా మీమాట!
డాక్టర్- యింతకీ ఆ అల్లుడెవరో చెప్పావుకావు!
సీతా- ఎవరైతేనేం దానికి నచ్చాను!
వెంక- మీకు నచ్చలేదా సార్?
సీతా- నేను పెళ్ళాడి కాపురం చేస్తానటయ్యా? అది పెళ్ళాడుతుంది. దానికేగా నచ్చాలి!
వెంక- అదేమిటి సార్! మీరట్లా అంటారు?
సీతా- సరే! చెప్పమ్మా! నువ్వే చెప్పు! నీవరుణ్ని నువ్వే వర్ణించు! వీరిద్దరూ వింటారట!
హేమ- (నవ్వుతూ) ఏమిటి నాన్నా మీరు?
డాక్టర్- నీకు అల్లుడేగా! ఆపని నీవు చెయ్యరాదూ?
సీతా- ఆహా! ఆవర్ణన దాని నోటినుంచే వినాలి. మన కళ్ళకి ప్రేమ కళ్ళద్దాలు లేవుగా!...మనకి అంచేతమామూలు మనిషిలాగే కనిపిస్తాను. ఒక్కటిచెప్తా విను శీనూ! యింత ప్రపంచంలోనూ ఆకుర్రవాణ్ని తప్పిస్తే దీనికి మరింకో మగవాడంటూ లేడట!...పాపం ఆపిచ్చి నాగన్నకీ యిదేరోగంలావుంది!
డాక్టర్- అలాగా! సరే ఒకరికొకరు డాక్టర్లండూ!
హేమ- బావుంది! మీరు యిద్దరూ కలిసిపోయారన్నమాట.

## అనుమానం



సీతా- అన్నట్టు ఏమమ్మా? గోపాలంసంగతి నువ్వేమీ పట్టించుకున్నట్టులేదే! నీమీద నమ్మకం పెట్టుకొనేకదా వాణ్ని యిక్కడికి చదువుకని పంపించాను!

డాక్ట- సరే యిప్పుడేమయింది?

హేమ- ఏమీ కాలేదు బాబయ్యా! తమ్ముడు డబ్బు ఎక్కువ ఖర్చు చేస్తున్నాడట! నాన్న ఖర్చుకాకుండా చదువు అయిపోవాలంటారు!

సీత- అదికాదమ్మా! వాడిని చూశావా? .. ఆవయస్సులో మేం ఎలా వుండేవాళ్ళమో తెలుసా? Match Foot Ball లాగా ఉండేవాళ్లం.

డాక్ట- రాత్రనకా పగలనకా శరీరారోగ్యం చూసుకోకుండా చదువుతున్నాడేమో!

సీతా- యింతకీ ఎన్నాళ్ళయింది నువ్వు వాణ్ని చూచి?

డాక్ట- (ఆలోచిస్తూ) ఎన్నాళ్ళయిందీ . . ఏమో! జ్ఞాపకంలేదు! రెండు నెలల క్రితం మాత్రం వాళ్ళ ప్రొఫెసర్ దీన బంధుదాసుతో కలిసివచ్చినట్టు జ్ఞాపకం!

సీతా- ఉద్ధరించావ్!...అవున్లే! అది నాదేతప్పు! నీలో ఆ శ్రద్ధా ఓపికా వుంటే ఏనాడో నువ్వొక యింటివాడివయి వుండేవాడివి.

డాక్ట- ఆమాట అప్రస్తుతం కదూ?

***************************** అనుమానం



సీతా- ఆ గోపాలంగాడు నెలానెలా వందలకి వందలు నీళ్ళ ప్రాయంగా ఖర్చుచేస్తున్నాడు తెలుసా?

డాక్ట- మనం మాత్రం ఖర్చుచెయ్యలేదోయ్ మనం చదువుకునేరోజుల్లో!

సీతా- వీడిలాగా?...దేనికయినా అర్థం పర్థం వుండాలి! అసలు హద్దనేది లేకుండాపోతే ఎలా? ఏమంటావు వెంకట నారాయణా!

వెంక- ఔనుసార్! అది నిజంసార్! గోపాలం బాబుగారికి యింకా పసితనంసార్!

సీతా- ఏమో! తీరా చేతులు కాలినతర్వాత ఆకులు పట్టినట్టవుతుందేమో వాడిసంగతి!

డాక్ట- నువ్వేం భయపడకూ! వాడు తెలివయినవాడేలేవోయ్! ఆవిషయం నాకొదిలేయ్! అయితే అమ్మాయి పెళ్ళి ఎప్పుడు నిశ్చయించారు?

సీతా- యీవాళ పదహారుకదూ! వచ్చేనెల తే 16 దీని నిశ్చయ తాంబూలాలు...ఆనాడే హేమ పుట్టినరోజుకూడా!

వెంక- అమ్మాయి పుట్టినరోజే నిశ్చయ తాంబూలాలా? బావుందిసార్!

హేమ- బాబయ్యా మీరు వచ్చితీరాలి!

డాక్ట- అలాగేనమ్మా!

## అనుమానం



సీతా- యీ అలాగేలు లాభంలేదోయ్! వచ్చి తీరాల్సిందే! అలా సాకులుచెప్తూ ఆరేళ్ళు గడిపేశావు! ఎప్పుడూ యీ ఆసుపత్రి... రోగాలూ, మందులూ డబ్బూ... యివేనా! .. వారం పదిరోజులుండి వచ్చేద్దువుగాని... వెంకటనారాయణా! నీవూ రావాలిసుమా...మీ పిల్లల్నందర్నీ తీసుకొనిరా!

హేమ- అవును! తప్పకుండా రావాలి!

వెంక- నేనెలా రాగలనమ్మా ... బాబుగారు వెళ్తే యిక్కడ నేనయినా వుండకపోతే...

సీతా- మరేం కొంపమునిగిపోదులేవోయ్! ... మనవాడికి ఆ రోజులలో మతి మరుపు జాస్తీగా వుండేదిలే! యిప్పుడూ వుండొచ్చు యింకా - అంచేత ... వెంకటనారాయణా నీవు కొంచెం హెచ్చరించు ... ఆనాటికి మీరిక్కడ ఉండితీరాలి.

హేమ- తమ్ముడు రెండురోజులు ముందుగానే వస్తాడుగా. అందరూ కలసి రాకూడదూ!

సీతా- అవునోయ్! అలా చెయ్యండి! రెండురోజులు ముందుగానే రండి!

డాక్ట- ఎలారావడం! యిక్కడ ...

సీతా- నాలుగురోజులలో నీప్రాక్టీసేమీ దెబ్బతినదులే!

అనుపానం



హేమ- రా బాబాయ్!...పాపం! విశ్రాంతన్నది లేకుండా
యంత్రంలా పనిచేసి అలసిపోయున్నారు. యీ మధ్య
మీ వంట్లోనూ బావుండడంలేదని వ్రాశారు.

సీతా- ఆ! రెస్టు తీసుకున్నట్టుంది. ఆ సముద్రం, ఆ గాలీ, నీకు
కావలసినంత బలం. ఉత్సాహం యిస్తాయి.

డాక్ట- సరే! ఆలోచిస్తా.

సీతా- ఆలోచించడం ఏమిటింకా నామొఖం! వస్తానను!

డాక్ట- అలాగే (యింతలో Telephone మ్రోగుతుంది. అందుకుని)
హల్లో! ఎవరూ? ఓ శంకర్రావా?...
ఆ! ఆ! నేనే పంపించానా కేసుని. పరీక్షచేశారా?...
ప్రమాదకరమే కదూ...అదే నేనూ చెప్పాను...పాపం!
Poor Frllow (రిసీవర్ Serious గా వుంచుతాడు.)

సీతా- ఏమిటలా వున్నావ్?

డాక్ట- శంకర్రావు దగ్గిరికొక కేసు పంపించాను!

సీతా- సర్జన్ శంకరమేనా?

డాక్ట- ఆ!...

వెంక- ఏమన్నారు సార్?

డాక్ట- ఏముంది అనడానికి?

వెంక- మీరు చెప్పిందే చెప్పారా?

## అనుమానం





డాక్ట- ఆకస్మికంగా దురదృష్టవంతుడు వెంకటనారాయణా!

వెంక- అది పనం అనకూడదుసార్!

హేమ- ఏమిటి బాబయ్యా?

డాక్ట- ఏమీలేదమ్మా! నూరేళ్ళూ నిండబోతున్న ఒక అభాగ్యుని సంగతిలే!

సీతా- ఒకరి కష్టాలూ, బాధలూ నెత్తిన పడ్డాయనే నేను డాక్టరీ చదవలేదు. మన బాధలే మనకి హెచ్చు యింక యితర్లకోసం ఏడవడానికి నాకు ఓపికలేదు! వీడు డాక్టర్ కోర్సు చదవమని ఎంతబలవంతం చేశాడను కున్నావ్!

హేమ- నాన్నా! మీరుగాని డాక్టరయ్యుంటే బలే గొప్ప పేరు సంపాదించు కొనుందురు. చేతకాని డాక్టరుగా!

సీతా- నిజం చెప్పావమ్మా!

డాక్ట- చప్! అలా అంటే నేనొప్పేదిలేదు! మేం అంతా మీ నాన్నకంటె ఎక్కువ తెలివైనవాళ్ళం కామమ్మా! మేం చదువుకునే రోజుల్లో మీనాన్న జీనియస్ అంటే అఖండమేధావి అన్నపేరు సంపాదించు కున్నాడు. తెలుసా? అల్లాంటప్పుడు చేతకాని డాక్టరవుతాడని అనడం...

హేమ- కాదు బాబయ్యా! నాన్న కష్టాలకు తట్టుకోలేక బాధ పడ్తున్నరోగికి సిద్ధాంతంగా పరీక్షించి, తగినమందు యివ్వ డానికి మారు - తనే ముందుగా ఏడపు లంకించుకొని బాధ పడ్డారు!

వెంక- నిజం చెప్పావమ్మా! నాన్నగారిది మెత్తటి హృదయం నాకు తెలుసమ్మా!

సీతా- చాల్లేవోయ్! ఆహృదయం మాటకేం! కళ్ళల్లో ఎలుకలు పరిగెడ్తున్నాయ్! యింకా ఆసుపత్రి పనుందా?

డాక్ట- ఆ! దానికేంలే వెంకటనారాయణా మేం యింటికి వెళ్తాం ఏమయినా తొందర కేసులొస్తే యింటికి ఫోన్ చెయ్యి! లెండి! యింటికిపోదాం! లే అమ్మా-

(అందరూ లేస్తారు : తెరపడ్తుంది)

---

అనుమానం

## రెండవ దృశ్యం



(సీతారామయ్య యింట్లోగది. కుడివైపుద్వారం. ఎదుటి గోడలోని కిటికీలోంచి, తోటలోని కొబ్బరిమొక్కలు కనిపిస్తుంటాయి. కిటికీ దగ్గర చిన్న టీపాయ్ మీద పూలవేసుంటుంది. కుడివైపు బీరువా, ఎడమవైపు యినప్పెట్టె ఉంటాయి. బీరువామీద చిన్న అద్దం ఉంటుంది. గదిమధ్య ముందరికి ఒకసోఫా, యిరువైపులా రెండుకుర్చీలు ... గోడని గడియారం రెండుగంటలు సూచిస్తుంటుంది. గదిలో Fan తిరుగుతుం టుంది. హేమలత కిటికీలోంచి తోటలోనికి చూస్తుంటుంది. విచారంగా వుంటుంది. నిట్టూర్చి పాటపాడ్తుంది.

పాట– హృదయమిచ్చి వలచినాను
వదలిపోవ న్యాయమా!...
వినతులతో పిలచినాను
విననిదేమి న్యాయమూ॥
యిలలో నావలపు కలలు
కలలుగానె నిలుచునా!
తలలెత్తే కలత పొగలు
నిలువున నను కాల్చునా!
పెదవితుదను మధువు సుధలు
చెదరి నేల జారునా.
వ్యథల పావలి శిథిలమగుచు
బ్రతుకుకథయె మారునా ॥హృ॥

❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖ అనుమానం



పాటపూర్తయేసరికి హేమ సోఫాలోన కూలబడ్తుంది... సీతారామయ్య గ్లాసులో మజ్జిగ తాగుతూ ప్రవేశిస్తాడు. అతని వెనుకనే గోపాలం ప్రవేశిస్తాడు.)

సీతా- (తాగటం పూర్తిచేసి) అబ్బ! ,ప్రాణాలు లేచొచ్చాయి! (టేబుల్ దగ్గర గ్లాసు పెట్టి ముందుకి వచ్చి) ఎండ మహా తీవ్రంగా వుంది. వడగాడుపు లొస్తున్నాయి...ఏమిట్రా అలా చూస్తూ నిల్చున్నావ్? ... ఆ తెరలు వెయ్యి! కొంచెం చల్లగా వుంటుందేమో... (గోపాలం కిటికీ తెరలు వేస్తాడు) ఏ అమ్మా! అలా కూర్చున్నావేం? యింటికి బంధువులూ స్నేహితులూ వొస్తున్నారు... రేపే నీ పుట్టిన రోజు పండగ...ఎంత సంతోషంగా ఉండాలి?...ఆ! బావుంది! ... ఎవరైనా నవ్విపోతారు ... ఎందుకా విచారం?

గోపా- శేఖరంగారు రాలేదుకదూ... అందుకని...

హేమ- ఆ! నీతో చెప్పానురా! అలాఅని...

సీతా- వాడిమీదె కోపముకే అలా విరుచుకపడ్డావ్? శేఖరంకి ఏమి పనులున్నాయో యేమో! యిరువైనాలుగ్గంటలూ నీ వెనకాల్నే తిరగాలంటే అయ్యేపనా? మగవాడన్న మ్మీదు లక్ష వ్యవహారాలుంటాయి.

అనుపానం



హేమ- నా వెనకనే తిరగాలని నేననలేదు! మీకు తెలియదు నాన్నా! యిన్నాళ్ళూ లేని వ్యవహారాలు యిప్పుడే వచ్చేశాయా?

సీతా- ఏమో! నాకెలా తెలుస్తుంది?... మీలో మీరు ఏం పోట్లాడుకున్నారో ఏమిటో?... నాతో చెప్తారా ఏం?

హేమ- పోట్లాటలెందుకూ?...

సీతా- మరెందుకలా బాధపడం?

హేమ- యిక్కడెవ్వరూ బాధపడడం లేదు...

సీతా- బావుంది... అయితే నీ వ్యవహారాన్నేమనాలి? సరిగ్గా తిండి తినవ్వూ... మాటాడ్తే కస్సుమని లేస్తావు... కళ్ళల్లో దీపాలు పెట్టుకుని కూచుంటావ్వూ!

హేమ- మీకేం తెలీదు నాన్నా... మీరేమీ గాభరా పడకండి.

సీతా- మధ్య మంత్రసానిలా నే గాభరాపడేది? ఏంరా గోపాలం శేఖరం దగ్గిరికి వెళ్ళావా!... ఏం అన్నాడు...

గోపా- ఏవో జరూరుపనులున్నాయట - రాలేకపోయినందుకు ఏమీ అనుకోవద్దన్నారండీ!

సీతా- ఆ! నేను! చెప్పలేదూ ... మొదటనే చెప్పేనా లేదా? ఏవో తొందర పనులుంటాయని ...ఎప్పుడొస్తానన్నాడురా?



గోపా- ఏమో! ఆమాట నేనడగ లేదు...

సీతా- అడగ లేదూ?... బావుంది ... నీ తెలివేమవ్వా! ఎందుకురా మీ చదువులు?... సరే... అమ్మాయ్! నువ్వేమీ బెంగ పెట్టుకోవద్దు! శేఖరాన్ని తెచ్చే పూచీనాది ... సరేనా గోపాలం...

గోపా- ఏవండీ?

సీతా- బండికి వేళయిందనుకుంటా... కాదు స్టేషన్ కతీసెళ్ళ కూడదూ!... శ్రీను యీ బండిలోనే కదమ్మా వస్తున్నాడు. (హేమ తలవూపుతుంది) పోనీలే! ... నేనే వెళ్తా. డ్రైవర్ని కారు తెమ్మని చెప్పు! (గోపాలం వెళ్తాడు) యిదిగో హేమా! అందరూ వొస్తున్నారు... నీవిలా కొనవిరిగి వుండడం బావుండదు ... నీకు తెలియనిది కాదు ... అయినా... చెప్తున్నా సంతోషంగా నవ్వుతూ ఉండవలసిన సమయంలో ఏమిటీ కన్నీరు?... శేఖరం వస్తాడు లే! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించే శేఖరం నీదగ్గరికి రాకుండా ఎక్కడికు వెళ్తాడమ్మా నీపిచ్చిగాని... అందులో రేపే నిశ్చయ ప్రదానం...వొస్తాడమ్మా! తప్పకుండా వస్తాడు!

హేమ- నిజంగా వస్తారా?







సీతా- ముమ్మాటికి...మనుషుల మనస్సులోని లోతుపాతుల్ని అర్థంచేసుకున్న నామాటనమ్మ తల్లీ! శేఖరం మాత్రం నిన్ను విడిచి నిశ్చింతతో వుండగలడనుకుంటున్నావా? అతనూ నీలాగే బాధపడ్తుంటాడు!

హేమ- ఆ! ఆయనెందుకు బాధపడ్తారు నాన్నా!

సీతా- నీకు తెలీదమ్మా! అనురాగం, ప్రేమ అనే యీమహోత్కృష్ట అనుభవాలు, యమయాతనతో బాధపడే హృదయాలలోనే బాగా లోతుకి పాతుకిపోయి పెరుగుతాయి! ప్రేమించే ప్రతీ హృదయం బాధపడాలి... శేఖరం నిన్ను తన ప్రాణం కంటె ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. అది నీకుమాత్రం తెలియదూ?

హేమ- ఆయనకేం? మగవాడు!

సీతా- అదే! అదే! అక్కడేవుంది పొరపాటు! బాధ అనేది ఒక్క ఆడదాని హక్కు కాదమ్మా! మగవాడికీ అందులో సగం భాగం వుంది. ఆడది వెక్కిళ్లు బిక్కిళ్లుగా ఏడిస్తే, మగవాడు లోలోపల కుళ్ళిపోతాడు. అంతే భేదం!... అంచేత... గోపాలం (ప్రవేశించి) కారొచ్చింది నాన్నా!

హేమ- యీ యెండగాడ్పులో మీరు వెళ్ళాలా? తమ్ముడు వెళ్తాడ్లెండి.

అనుమానం

సీతా- పర్వాలేదు! ఎండకేముందీ? ... నీకంటె ఎక్కువగా నేనేం బాధపడనులే! చూసూ ఉత్సాహంగా ఉండాలి. బాబయ్యొస్తున్నాడు ... గోపాలం ... నువ్వొటూ వెళ్లిపోకేం? (అంటూ సీతారామయ్య వెళ్ళిపోతాడు)

హేమ- ఏంరా? ... అక్కడికి నువ్వెందుకు వెళ్ళావ్?

గోపా- ఎక్కడికి

హేమ- ఎక్కడికా ... ఆయనదగ్గిరికే! ఎందుకెళ్ళావ్?

గోపా- ఏం? వెళ్తే తప్పా? ... నాన్న వెళ్ళమన్నారు వెళ్ళేను.

హేమ- ఏమిటిచెప్పావు?

గోపా- ఏమిటి చెప్పాలి? నేనేమీ చెప్పలేదు!

హేమ- అంత చిరాకెందుకురా! పోనీలే చెప్పడానికి నీకంత కష్టమయితే మానేయ్!

గోపా- చిరాకుకాదూ? ... నీప్లీడరు ప్రశ్నలూ నువ్వూ

హేమ- పొరపాటయ్యిందిలే! ... ఏదో వెళ్ళావుగనుక అడిగాను!

గోపా- నువ్వూ వెళ్ళావుగా అయిదారుసార్లు ...

హేమ- ఏంలాభం ... అతని దర్శనం అయితేనా ఒక్కసారయినా?

గోపా- యింట్లోలేనప్పుడు వెళ్ళుంటావ్!

**అనుమానం**

హేమ-కావాలని తప్పించుకుని తిరుగుతున్నట్టుంది రా... యిన్ని మార్లు నేను వచ్చానని తెలిసికూడా తనక్కానట్టు ఊరుకున్నారే... నేనేం తప్పు చేశానురా తమ్ముడూ! నన్నిలా శిక్షించడానికి నేనేం పాపం చేశానురా?

గోపా- నాకేం తెలుసు?

హేమ-ఒక్క క్షణం చూడలేకపోతే వుండలేకపోయేవారు... ఒక్క నిమిషం నేను మాటాడకపోతే బ్రతకలేననే వారు...ఎంత మారిపోయారు? యీనాటికి నెల రోజులు కావొస్తూంది! కంటికి కనిపించకుండా మాయమైపోయారు! యిక్కడ నేను యిలా కుమిలిపోతున్నానని తెలిసీ ఒక్కసారి కూడా రాలేదే! ఇంత కఠినత్వమా? తమ్ముడూ! రేపయినా వస్తానన్నారా?

గోపా- అబ్బ! ఏమస్తావెందుకే! వస్తార్లే! ... రాకేం చేస్తారు?... రేపు నిశ్చయతాంబూలాలు తీసుకోడం కూడ వుందిగా!

హేమ-నిశ్చయ తాంబూలాలు! హు! రేపు!... తమ్ముడూ! పోనీ ఆయన బాగానే ఉన్నారుకదా!

గోపా- బాగానే అంటే?

హేమ-క్షేమంగా, ఆరోగ్యంతో, కులాసాగా ఉత్సాహంగా వున్నారా?

గోపా- అదేమిటోనే! అదోమాదిరిగా వున్నట్టు కనిపించారు. ముందున్నంత ఉత్సాహం లేనట్టుంది ఆయనలో! నీరసంగా కనిపించారు!

హేమ-నీరసంగానా?

గోపా- తనేదో బాధపడ్తున్నట్టు మాట్లాడేరక్కా!

హేమ-నిజంగానా? ... ఎందుకో? ... యిలా నన్ను బాధ పెడ్తూ తనూ బాధపడడం ఎందుకో? ... ఎన్నాళ్ళిలా తప్పించుకొని తిరుగుతారు? యిందుకోసమేనా మనసులు కలుపుకొని అనురాగంతో కలల మేడలు కట్టుకోడం!

గోపా- ఆయన రానంతమాత్రంచేత నువ్వెందుకు అంత బాధ పడడం?

హేమ-ఆయన నీతో ఏమిటి చెప్పారే?

గోపా- ఏమో! నా కేమీ జ్ఞాపకం లేదు. తను రోజులూ, గంటలూ, నిమిషాలూ లెక్కపెట్టున్నట్టు మాట్లాడేరు. (కారు ఆగిన చప్పుడు) అదేంటి? కారొచ్చేసింది. స్టేషన్ నించి అప్పుడే వచ్చేశారా?

హేమ-(ఉత్సాహంతో) అది ఆయన కారు! ... (ద్వారం దగ్గిరికి వెళ్ళి) అమ్మయ్య వచ్చారు!

గోపా- శేఖరంగారేనే! ... అదుగో వస్తున్నారు! ఎందు కాకంగారు! యిక మరిమాలోకంలోనే వుండవు!



హేమ-పోరా! మధ్య నువ్వేమిటి! ... (వెళ్ళిపోతుంటే శేఖరం ప్రవేశం) చివరికి వచ్చారే! ... యిప్పటికి జ్ఞాపకం వొచ్చానా? రండి! కూర్చోండి!—అలా వున్నారేం? ... ఒంట్లో ఎలా వుంది?

గోపా- ఏమిటక్కా- ఆ వడగళ్ళవర్షం? ఒక ప్రశ్నకయినా జవాబు రాకుండే అన్ని ప్రశ్నలా? ... యిలా వచ్చారో లేదో అప్పుడే మొదలెట్టాలి? పాపం ఎండలో వచ్చారు చల్లని షర్బత్ తీసుకొస్తా (వెళ్ళిపోతుంటే)

శేఖ- ఒద్దోయ్! యిప్పుడేమీ వొద్దు! అలా కూర్చో!

హేమ-తాగండి! మనసు చల్లబడుతుంది! ఒరేయ్ తమ్ముడూ! నాకూ ఒక గ్లాసు తీసుకురారా!

గోప -నీ మనస్సిప్పుడే చల్లబడిందిగా - యింకా షర్బతెందుకు దండగ! (వెళ్తాడు)

హేమ-కూర్చోండీ! కూర్చోకూడదా?

శేఖ- ఇప్పుడు షర్బత్తెందుకు?

హేమ-ఇదేనా నేనడిగినదానికి జవాబు?

శేఖ_ జవాబు కేంగాని ... ఏం యిలా వున్నావ్?



హేమ-మీరు మహాబావున్నట్టు!...యిన్ని రోజులూ ఇక్క డికి రాకుండా ... ఇంటికి వస్తే కనిపించకుండా ... మాటాడే అవకాశం ఇవ్వకుండా ... తప్పించుకొని దూరంగా వుంటూ యిలా నన్ను శిక్షించడానికే నేనేం నేరం చేశాను? ఏం దోషం చేశాను? యిది న్యాయంగా వుందా మీకు? చెప్పండీ! (యేడుస్తుంది)

శేఖ- ఇదుగో హేమా! హేమా! యేడవకు! యేడవకు! చూడూ! నా వేపు చూడూ! కావాలని యిట్లా చేశానని భావిస్తున్నావా?...నీకు బాధ కలిగించే కఠినత్వం నాలో ఉందా?...

హేమ-అయితే మీ రెందుకిన్నాళ్ళూ రాలేదు?...ఎన్ని ఆశలు పెట్టారు? ఎన్ని మాటలు చెప్పారు? ఎన్ని తీయని కలలకు దారి చూపారు?...ఎంత చక్కగా నమ్మించి నన్ను మీ వశం చేసుకున్నారు? యిందు కేనా? యిందుకోసమేనా?...మిమ్మల్ని మీ మాటల్ని నమ్ముకొని - నా సర్వస్వం మీరే అని భావించి పూజించినందుకు యిదేనా మీరు నాకిచ్చే ప్రతిఫలం?

శేఖ- నిందించు! తిట్టూ! ఎంత కష్టం కలిగించానో నీ లేత హృదయానికి!...ఎంతబాధ కలిగిందో నీకు! ... కసి దీరేటట్టు నిందించు! నిజం! నీ వన్నట్టు హృదయం







లేని కసాయివాడిలా నిన్ను కష్టపెడుతున్నాను! నా మీద కోపమొచ్చిందా? ... నేనుచేసింది ఒక్కటే పొరపాటు! ...

హేమ-మీ రెందుకు పొరపాట్లు చేస్తారు?

శేఖ- నిజం హేమా!... నిజం చెపుతున్నా - నీలాంటి దేవతను ప్రేమించడానికి సాహసించడం పొరపాటే!

హేమ-నేనేం దేవతనీ దెయ్యాన్ని కాను.

శేఖ- హేమా! నీ కాలిగోటిని తాకే అర్హత లేదు నాకు! నీ పవిత్ర సాంగత్యాన్ని కాంక్షించే యోగ్యత నాకు లేదు! నిన్ను భార్యగా చేపట్టడం దైవాన్నే దూషించడం అని భావిస్తున్నా-నేను నీకు తగను! హేమా! . . నేను దురదృష్టవంతుణ్ని. యోగ్యతా, అర్హతా లేకుండా నిన్నెట్లా ఆశించగలను?

హేమ-ఏమిటా మాటలు? ... మీ రేమంటున్నారో తెలుసా? మీకు మతి పోయినట్లుంది!

శేఖ- నిజం చెప్పావు! నాకు మతిపోతూవుంది! ఏమిటంటున్నానో తెలియడంలేదు! ఏమీ తోచడంలేదు.

హేమ-మీ రెందుకలా బాధపడ్తారు? ... అసలు సంగతేమిటో నాతో చెప్పకూడదూ? మనసు విప్పి చెప్పండి! ... మీకు పుణ్యముంటుంది!



శేఖ- హేమా! నన్ను మరచిపో! నీవు సౌఖ్యంగావుండు! నీ ఆనందం ఏ లోకంలో వున్నా నేను సదా కోర్తుంటాను.

హేమ- ఏమిటా మాటలు? అవి నన్నెంత బాధిస్తున్నాయో మీకు తెలుసా? ఎందుకిలా పిచ్చివానిలా మాట్లాడ్తున్నారు?

శేఖ- నేను దౌర్భాగ్యుణ్ని హేమా! నావలన నీ జీవితం నాశనం కాబోతున్నది! నాకంటె అదృష్టవంతుణ్ని యింకొకర్ని ...

హేమ-ఏమంటున్నారూ? ... బావుంది! మీ కర్పించిన నా మనస్సు ఇంకొకరి కివ్వాలా? మీ రేనా యీ మాట లంటున్నారు? మీరే నా సర్వస్వం అని నమ్ముకొనున్నానే, యింకొకర్ని కన్నెత్తి ఎలా చూడగలను? ప్రేమించడం అంటే ఏమిటో మీ దగ్గర నేను నేర్చుకున్నా ... అందులోని ఆనందం, విషాదం, వెన్నెలా చీకటి, అంతా మీసాంగత్యంలో అనుభవించాను. మన ఆత్మలకు ఏనాడో ఏ లోకంలోనో వివాహం అయిపోయింది! లోకాచారంగా కేవ్వ మన పరిణయం జరగబోతుంది! యీ సమయంలో మీ నోటినించి యీ మాటలా నేను వినేది? ఇవి మీరన వలసిన మాటలేనా?

సమాప్తం 

శేఖ- అది కాదు హేమా!

హేము-అసలు ఏమిటి మీ సంకోచం? ఎందుకిట్లా మీరు మారిపోయారు? మొన్న రామచంద్రపురం బాబయ్యగార్ని పిలవడానికి వెళ్ళినదగ్గర్నుంచి మీరు నాకు దూరం అయిపోయారు. నన్ను దూరం చెయ్యకండీ! మీరు లేనిది నాకు బ్రతుకే లేదు! యిప్పుడే చెప్తున్నా!

శేఖ- (కళ్ళనీళ్ళతో) నేనూ ఆదాన్యబ్యానికి లొంగిపోయే యిక్కడికి పరుగెత్తుకొచ్చా!...నీకు దూరంగా వుండే శక్తినాలో లోపించింది! నీవులేని జీవితం. .

హేమ-(భుజంపట్టి సోఫాలో కూర్చొపెట్టి తనూ ప్రక్కనే కూర్చుని) ఏమండీ! ఏమిటది?...మీరు మనసులో ఏదో దాచుకొని బాధపడ్తున్నారు ..నన్నూ బాధపడ్తున్నారు! ఏమిటది?...నాతో చెప్పకూడదూ? నేనేం పరాయిదాన్నా? హృదయాలు పంచుకున్నామే ..యిలాపొంతలు చూపించడం మంచిదా? నన్ను నమ్మరూ?.. చెప్పండి!

శేఖ- హేమా! ఎలా చెప్పేది?...ఏమిటని చెప్పేది...

హేమ- ఏమిటి మీ బాధ? . నావలన ఏమయినా పొరపాట్లు జరిగుంటే.

శేఖ- లేచిపోయి) హేమా! పొరపాట్లా? నీవల్లా? మాటల్తో నన్ను బాధించకు హేమా!

హేమ- సరే! అలాగే కానీయండి!...కాని ఒక్క మాట చెప్పండి మీరు మారిపోయారు! అదిమాత్రం నిజం! మీరు కాదనలేరు! మొదట్లో నామీద మీకుండే అభిమానం కూడా మారిపోయిందా? (శేఖరం చెంపదెబ్బ తగిలినట్టుబాధ పడ్తాడు.) చెప్పండి! మీహృదయం కూడా మీప్రవర్తన లాగే మారిపోయిందా? నన్ను దూరంచెయ్యాలనే మీ మనస్సులోవుందా?

శేఖ- (తలవంచుకొని) హేమా! నీవన్న ఆమార్పు నాలోవస్తే ఎంతబావుండేది! ఎంతయాతన తప్పి ఉండేది? హు! హేమా! నీకు తెలియదు! యిన్నిరోజులూ నేనెట్లాంటి నరకంలో బాధపడ్తున్నానో! పరస్పర వ్యతిరేక భావాల సంఘర్షణలో ఎంతకుమిలిపోతున్నానో! హృదయానికీ మనస్సుకీ శాంతిలేశం లేకుండా ఎంత మథనపడు తున్నానో!

హేమ- అంతబాధతో మథనపడవలసిన అగత్యమేముందీ?అంత అనవసరమేమొచ్చిందీ?

శేఖ- ఎలా చెప్పనూ? ఎలా బోధపర్చగలను? హేమా! నాలాంటి దురదృష్టవంతుడు, నాలాంటి దౌర్భాగ్యుడూ ఈ లోకంలోలేడు!

హేమ- (చేరువకు వెళ్ళి) ఎందుకు మిమ్మల్ని మీరే అలా నిందించుకుంటున్నారు? మీతీరు నాకేమీ అర్థం అవడంలేదు!



ఏమిటిది నాతో చెప్పకూడదా? ఏమిటి మీరు చేసిన నేరం

శేఖ- నేరం! నేను పుట్టడమే ఒక నేరం! బ్రతికివుండడం యింకొక నేరం! నిన్ను ప్రేమించడం అన్నిటికంటె మించిన నేరం! హేమా! నన్ను మరచిపో! మరచిపో! నీవు ఆశించే ఆనందం, సౌఖ్యం, నేనివ్వలేను! ఏమాత్రానికీ అవి నాదగ్గిర నీకు దొరకవు! నామూలంగా నీజీవితం నరకమయం అయి తీరుతుంది!

హేమ- శోవున్నాయి మీమాటలు! కూర్చోండి! కూర్చొని కాస్త స్థిమితపడండి! తర్వాత మాట్లాడ్దాం...ఎండలోంచి వచ్చినందుకు మతి చలించినట్టుంది! అదుగో చల్లని షర్బత్ తాగండి! (గోపాలం రెండు గ్లాసులలో షర్బత్ తీసుకొస్తాడు. శేఖరం స్థిమితపడడానికి యత్నిస్తూ గ్లాసు అందుకుంటాడు. రెండోది హేమ తీసుకుంటుంది)

హేమ- తాగండి! అలా గ్లాసుపట్టుకొని చూస్తారేమిటీ?

శేఖ- (తలవంచుకొని తాగుతూ) నాన్నగారేరీ?

గోపా- రేపు వుందిగా దీని తద్దినం! అందరూ యీవాళ దిగుతున్నారు! నాన్న స్టేషన్‌కి వెళ్ళారు!

శేఖ- మీ అక్కయ్య పుట్టినరోజు నీకు తద్దినం అయిందా?

గోపా- కాకుంటే యింకేమిటండీ?...అనవసరంగా ఎంతఖర్చో చూడండీ!...యీయిబ్బంది రోజులలో...దీనికోసం చేసే ఖర్చులో పదోవంతు నాకివ్వకూడదూ?

హేమ- యెందుకూ? లాటరీల్లో తగలెయ్యడానికా?

గోపా- తగలెయ్యడమా! నీకు వేళాకోళంగానే వుందే! నాన్న నాకోదమ్మిడీ యిస్తే నేను దానికి సరీగ్గా లెక్క చెప్పాలి!

శేఖ- అవునోయ్! అంత దుబారా అయితే ఎలాగు?

(ఖాళీగ్లాసు గోపాలం అందుకుంటాడు. యినపెట్టెమీద పెట్ట బోతుంటాడు)

హేమ- అక్కడెందుకా గ్లాసు అలంకారమా? యిదిగో! యిది కూడా లోపలికి తీస్కెళ్లూ!

గోపా- బావుంది! అన్నింటికీ నేనేనా? గొప్పవాడికి?

హేమ- పోనీరా! నేనేవెళ్తా! నాన్నచూస్తే చీవాట్లు నాకవు తాయి! (గ్లాసులు తీసుకొని లోపలికి వెళ్ళిపోతుంది)

గోపా- శేఖరంగారూ! చాలా కష్టంకలిగించే మాటనిసేశారు!

శేఖ- ఏమిటదీ?

గోపా- దుబారాగా నేను ఖర్చుచేస్తున్నాననా్నరే! లక్షలు గడించడానికి ఒకరూపాయి ఖర్చుచెయ్యడం దుబరా అంటారా?

శేఖ- యిప్పటి కెన్నిరూపాయలయాయి? ఎన్ని లక్షలు గడించావోయ్?

గోపా- శేఖరంగారూ! అదృష్టం అన్నది ఒకటున్నదిగా! అది కలిసిరావొద్దూ?

## అనుమానం



శేఖ- ఏమిటో నీపిచ్చిగానీ... యీ లాటరీలకీ జూదానికీ ఏమీ తేడా నాకు కనిపించదు!

గోపా- నాకో లక్షరూపాయలొచ్చింతర్వాత చూద్దాం మీరేమిటంటారో! ప్రయత్నంలేనిదీ ఫలిత కావాలంటే ఎలా చెప్పండీ? లక్షలు గడించిన వాళ్ళు నాకంటె తెలివైన వారా?... రెండుసార్లు పుట్టారా?... వాళ్ళ అదృష్టం పొడుచుకొచ్చింది!

శేఖ- మీనాన్నగారికి తెలిసిందంటే నీకూ పొడుచుకొస్తుంది అదృష్టం!

గోపా- నాభయం కూడా అదేనండీ... యీలోగా నేగెలిస్తే ఎంతబావుండేది?... దైవసహాయం లేదేమో అని ఎన్ని దేవుళ్ళకి మొక్కుకున్నానో తెలుసా?... చివరికి తిరపతి కూడా వెళ్ళి జుట్టు యిస్తానన్నాను!

శేఖ- పాపం ఆ దేవుళ్ళందరికీ నీమీద అభిమానం లేకపోయింది ఎందుకోయ్ యీ పిచ్చిపనులు? బుద్ధిగా చదువుకోకుండా అటు డబ్బూ, యిటూ చదువూ పాడుచేసుకుంటూ— పైగా యింట్లో తెలిస్తే చీవాట్లూ చెప్పుదెబ్బలూనూ!

గోపా- మీకు తెలియదండీ! ఒక్క గెలుపుతో యివన్నీ ఎగిరిపోవూ? లక్షలొచ్చింతర్వాత పేటెలక్ష్యం ఏంటుంది చెప్పండీ! (కారువొచ్చి ఆగిన శబ్దం)అదుగో! నాన్నగారూ



వచ్చేశారు యీసంగతి నాన్నకి చెప్పకండిసుమా! మీ పుణ్యముంటుంది.

సీత- (హడావుడిగా లోనికి చెమట తుడుచుకొని వస్తూ) అబ్బా! ఏమి ఎండ! ఏమి ఎండ! అరే! శేఖరం!... ఏం వోయ్! యిన్నాళ్ళూ ఎటు తుఫాను పట్టి పోయ్యావ్? ఏం రా గోపాలం? నేనేమి టన్నాను హేమతో? తప్పకుండా శేఖరం వస్తాడే అని చెప్పలేదూ?... చూశావుటోయ్ శేఖరం!...నువ్వు రాలేదని అమ్మా యిది ఒకటే ఏడుపంటే నమ్ము! ఏమిటా రాచ కార్యం బాబూ యీ పదిసరాలకి కూడా రాసీయ కుండా యిన్నాళ్లా పేసింది?

శేఖ- యీ యెండలో ఎక్కడికి కెళ్లారు మీరు?

సీత- నేనా?...స్టేషనుకి వెళ్ళాను! మనవాళ్ళు వస్తున్నారుగా! గోపాలం! నువ్వెళ్ళి వాళ్ళసామాన్లు దింపించి సర్దించు! వెంకటనారాయణ కూడా వచ్చాడు. అతనికి ఒక గది చూపించు. (గోపాలం యీల వేస్తూ వెళ్తాడు) ఆ! యిదుగో శేఖరం! చూడూ! నీతో ఒక మాట చెప్పాలనుకుంటున్నాను.

శేఖ- ఏమిటండీ?

సీత- (యిటు అటు చూచి) చూడూ! పెద్దవాణ్ని...నామాట కొంచెం గమనించు!... హేమ అమాయకురాలు!



బంగారంలాంటిపిల్ల!... ఆశలన్నీ నీమీదే పెట్టుకొని, నువ్వే సర్వం అని నిన్నే నమ్ముకునివున్నది. తండ్రి ననే అభిమానంతో నేనిది చెప్పడంలేదు ... నాకు మీరు ఆనందంగా వుండడమే కావాలి! నేను కోరేదీ అదే! రెండు రోజులు నీవు రాకపోయినంతలో అది ఎంత బాధపడిపోయిందో తెలుసా? అందుకే నీతో యీ రెండుమాటలూ చెప్తున్నాను!... అమ్మాయి లేతహృదయాన్ని అర్థం చేసుకొని ప్రవర్తించమని కోరుతున్నాను. నీకు తెలియదని కాదు ... కన్న తండ్రిని... తల్లిలేని లోటు కనిపించకుండా గుండెల మీద పెట్టుకొని పెంచాను!... తండ్రి మమకారం అట్లాంటిది! అందుకే యీ నా కోరికను అన్యథా భావించకు!

శేఖ- బాబుగారూ! మీరింత నొక్కి చెప్పాలా? కోమలమైన హేమ మనస్సు నొప్పించి బాధించాలని నాకెన్నడూ లేదు! నేను సర్వదా కోరేది హేమ సౌఖ్యమే! హేమ ఆనందమే!

సీత- అవును. నాకు తెలుసును! అయినా అనుమానం కొండంత బరువుతో మనసులో కూర్చుంది. నీవు యీ మాట చెప్పావు! నా మనసెంతో తేలిక పడింది!



అదుగో శ్రీనూ వచ్చాడు. యిక యీ యింట్లో పండగే! యిక్కడే వుంటావుకదూ?

శేఖ- నేనా?

సీత- ఏం? ఉండవయ్యా! అందరూ వచ్చారు! తెల్లవారితే అమ్మాయి పుట్టినరోజు పండగ! మీ యిద్దరి ప్రధానం కూడా!... ఉండూ! ఆ! శ్రీనూ?

డాట- (బడలికతో) ఏమిటి? ఎందుకా కేకలు! ఏమిటా వుత్సాహం?

సీత- నీతో చెప్పలేదూ!... శేఖరం రాలేదని హేమ బెంగ పెట్టుకుందీ అని ... వొచ్చాడు ... యిదిగో ... యితనే శేఖరం ... శేఖరం యితను నీకు తెలియదనుకుంటా ... నాకు చిన్ననాటి మిత్రుడు డాక్టర్ శ్రీనివాసరావు. M. B. B. S. తీసుకొందిన Heart Specialist.

(శేఖరం బిత్తరపోయి చూసి తల దించుకుంటాడు. డాక్టరు బొమలు ముడివేసి పరీక్షగా చూస్తుంటాడు)

సీత- మీరు మాట్లాడుతుండండి. వాళ్ళేమయ్యారో చూస్తా. ఒరే! గోపాలం (హడావుడిగా నిష్క్రమిస్తాడు)

డాక్ట- నువ్వేనా?... ఆనాడు నువ్వేకదూ...

(శేఖరం సిగ్గుతో తలదించుకుంటాడు. ముఖం చేతుల్తో కప్పుకుంటాడు)

 

డాక్టర్- ఏమిటి నీఅభిప్రాయం? ఎంతమోసానికి పూనుకు టు న్నావో తెలుసా?...పోనీ-నామాటమీద నీకు నమ్మకం లేకపోయినా సర్జన్ శంకరాప్రుమాట మీదకూడా నమ్మకం లేకపోయిందా? నీముఖంచూస్తే నువ్వింత ద్రోహానికి పూనుకుంటావని నాకు తోచలేదు. అందు కనే నీతో నాహృదయంలోనిమాట చెప్పానుచివరికి...

శేఖ- (బాధతో) నన్ను క్షమించండి డాక్టరు గారూ!

డాక్టర్- క్షమించాలా నిన్నా? నీమూలంగా నిందుబ్రతుకు నాశన మయిపోతున్న అమ్మాయి భవిష్యత్తునిఆలోచించావా? నీ నిజ పరిస్థితిని...

శేఖ- (భయంతో) మీారు వెల్లడిచేస్తారా?

డాక్టర్- ఒళ్లుతెలిసి మాట్లాడు! నేను డాక్టర్ని...నీవిషయం నలు గురిలోవేసి నావృత్తికి నేను ద్రోహం చేసుకోలేను... అందుకనే నిన్ను హెచ్చరిస్తున్నాను. యింతవరకూ నీవెవ్వరివో అనుకున్నా. ఆనాడు నిన్ను పరీక్ష చేస్తున్న ప్పుడు అది నాకు ఆత్మీయంగా దెబ్బతీస్తుందని కలలో కూడ నే ననుకో లేదు. నీ దురదృష్టానికి మాత్రం విచారించాను... కాని యిప్పుడు...

శేఖ- యిప్పుడు ? యిప్పుడేమయినా నాకు ఆశ ... బ్రతికే ఆశ వుందా ...

డాక్టర్- ఏమాత్రం అవకాశం వున్నా నిన్నునిరాశలో ముంచే వాణ్ని కాను నేను... కానీ...

శేఖ- డాక్టరుగారూ! ఏమిటి చెయ్యడం? నేనేంటిచెయ్యాలి! మీరు భావిస్తున్నట్లు నేనంత నీచుణ్ని కాను. ఏమిటి చెయ్యాలో మీరే చెప్పండి!

డాక్టర్- యిన్ని రోజులూ యిక్కడికి రాకుండా వున్నవాడివి యీ రోజెందు కొచ్చావ్?

శేఖ- ఎంతో ప్రయత్నించాను యిక్కడికి రాకుండా వుందామని... నాకు సాధ్యం కాలేదు... ఒక్కసారి ఆఖరి సారిగా ఒక్కసారి హేమను చూచి, మాటాడి వెళ్లి పోవాలని... తిరిగీ ఏనాటికీ ముఖం చూపించకుండా వెళ్లిపోవాలిని వచ్చాను.

డాక్టర్- అంతేనా? అయితే నేను పొరపాటు పడ్డాను... అలాగే నువ్వు చేస్తే...

శేఖ- నిజం డాక్టరుగారూ!... హేమతో చివరిసారిగా సెలవు తీసుకుందామనే యీనాడు వచ్చాను! నామీదవృథా ఆశలు పెట్టుకోవద్దని, నన్ను క్షమించమనీ... క్షణక్షణా నికి మరణానికి ఎదురుచూసే నాకోసం తన జీవితం నాశనంచేయ వీలులేదనీ... చెప్పడానికే వచ్చాను!



డాక్ట- చెప్పావా?

శేఖ- (తల ఆడిస్తూ) లేదు...ప్రయత్నించాను. ఎంతప్రయత్నించినా చెప్పలేకపోయినాను! ఎలా చెప్పగలను? హేమ కన్నీరు చూచినంత మాత్రాన్నే నానిర్ణయం ఎగిరిపోయింది! నానిశ్చయం కరిపోయింది! డాక్టరుగారూ నేనెంత బాధపడుతున్నానో మీకు అర్థంకాదు! నా మనస్సులోని యీ తీవ్రసంఘర్షణవల్లనయినా ఈ పాడుజబ్బు అధికమై ఆఖరిగడియ సమీపించితే ఎంతో హాయిగా వుండేది!

డాక్ట- అదంతా నాకనవసరం! హేమ నాకు ఆత్మీయురాలు! నాకళ్ళముందే దాని బ్రతుకు ఎడారిగా పాడయిపోతుంటే చూస్తూ ఊరుకోలేను! హేమ సుఖాన్ని ఆనందాన్ని కాంక్షించే నీవు మాత్రం ఎలా ఒప్పుకోగలవ్? యింత చిన్నతనంలో హేమని విధవగా చెయ్యడానికా నీవామెను పెళ్ళిచేసుకోవడం? నీతర్వాత, అది ఒంటరిగా ఎవరికోసం బ్రతకాలి?...ఎందుకోసం బ్రతకాలి?

శేఖ- నిజమే!...డాక్టర్‌గారూ! ఒక్కక్షణం నన్ను విడిచి హేమ వుండలేదే! ఎలా విడిచి దూరం చెయ్యగలను? ఎంత దుఃఖిస్తుంది! ఎంతబాధపడుతుంది?

డాక్ట- తాత్కాలికంగా కొంత దుఃఖించడం జీవితమంతా ఏడ్చేకంటేనయంకాదూ? ... నీమీదవున్న వ్యామోహం

కొద్ది కొన్నాళ్ళు బాధపస్తుంది. ఆతర్వాత క్రమంగా మరచి పోతుంది! కాలం ఎలాంటి గాయాన్నయినా మాన్పేస్తుంది...

శేఖ- డాక్టర్ గారూ! హేమ నా ప్రాణం! ఆమెతప్ప నాకీ ప్రపంచంలో అన్యం లేదు!...విడిచి వెళిపోమంటారా?

డాక్ట- త్యాగంలో మహత్తరమైన ఆదర్శం ఉంది నాయనా! మనం ప్రేమించే వారికోసం, వారి సౌఖ్యంకోసం, వారి ఆనందంకోసం మనం త్యాగం చెయ్యాలి! చేసితీరాలి అలా చెయ్యలేకపోతే మనది ప్రేమే అనిపించుకోదు! అది స్వార్థపూరితమైన వ్యామోహం!

శేఖ- నిజం!...నేను స్వార్థపరుణ్ణి! ... లేకుంటే యీ బల హీనతకు లోనయి హేమ అనూయక హృదయాన్ని పసిజీవితాన్ని బలికోరుతానా? హేమ బాగుండాలి! సదా సుమంగళిగా వుండాలి! నామూలంగా హేమ దుస్సహమైన వైధవ్యనరకంలో మునిగిపోతే స్వర్గంలో వున్నా నాఆత్మకి శాంతి ఉండదు.

హేమ-(వెనకనుంచి వచ్చి నవ్వుతూ) ఏమి టేమిటి? బాబాయ్ గారితో అప్పుడే చెప్పేస్తున్నారా?

డాక్ట- ఏమిటమ్మా?

హేమ- యీమధ్య వచ్చిన కొత్తజబ్బు సంగతిగాని చెప్తున్నారేమో అని...

అనుమానం



డాక్ట- కొత్తజబ్బా?

హేమ- వచ్చిందిలెండి! కంటికి కనిపించకుండా తప్పించుకోవడం, అర్థంపర్థంలేని పరాకుకవిత్వాలు మాట్లాడడం, ఏదో పాపం బాధపడుతున్నట్టు శ్రమపడడం...

డాక్ట- అలాగా...ఆజబ్బులకి నాదగ్గిర మందులు లేవమ్మా.. అన్నట్టు అమ్మాయ్! హేమా! నాదొక సందేహం తీరుస్తావా?...ఏం! అడిగేదా అబ్బాయ్?

శేఖ- (భయంతో) ఏమిటీ? ఏమిటవుగుతారు?

హేమ- ఏంటది బాబయ్యా!

డాక్ట- ఏదయినా ఒక కార్యం చెయ్యడంవల్ల బాధపడవలసి వస్తే, చేసి తాత్కాలికంగా బాధపడడం మంచిదా? చేసేధైర్యంలేక అందువల్ల బ్రతుకంతా బాధపడడం మంచిదా?

హేమ- ఏం? ఎవరిని ఆపరేషన్ చేస్తున్నారు మీరు? ఆపరేషన్ చేసేముందు మీరనే మాటలివేగా?

డాక్ట- కాదమ్మా! నీ అభిప్రాయంచెప్పూ!

హేమ- ఎవరైనా, లోకంలో తాత్కాలికమైన బాధనే ఎన్నుకుంటారు!

శేఖ- లోకంలోమాటకాదు హేమా.. నువ్వేంచేస్తావ్?

హేమ- నేనయితేమాత్రం-లోకన్యాయానికి విరుద్ధంగా కళ్లాలని వుందా?

డాక్టరు- ఏం? చూంశావా?... నేనేమన్నాను?

హేమ- మీమాటల్లో అసలు నేవొచ్చినపని మరచిపోయాను! బాబయ్యా! మిమ్మల్ని నాన్న పిలుస్తున్నారు... అదుగో యిక్కడికే వచ్చేశారు...

సీతా- (ప్రవేశిస్తూ) నేనుకొంటునేవున్నా యిక్కడికొస్తే సర్వం మరచిపోతావు ఏం మంత్రం వేసేవయ్యా నీయిల్లు బంగారంగానూ! వెళ్ళమ్మా! వెళ్ళు! కాఫీ ఫలహారం యివేమీ చూడడంవుందా? శేఖరం ముఖం చూస్తూ కూర్చుంటే మాకు కడుపులు నిండిపోతాయనూ? పోసి నువ్వూ వెళ్ళవయ్యా! (అని శేఖరంని తోస్తాడు)

హేము- ఏమిటి నాన్నా! మీ వేళాకోళాలూ!...

సీతా- కాదే! నామాట అబద్ధమా? యింతకు మునుపు నీ ముఖం ఎలావుండేది? శేఖరం రాకతో ఎలామారిపోయింది.

హేమ- పోండీ! (హేమలత శేఖరం యిద్దరూ లోనికి వెళ్తారు)

సీతా- (నవ్వుకొంటూ) పిచ్చితల్లి! భగవంతుడా లోకంలో ప్రేమ అనేది ఎంత విచిత్రమయినదిరా బాబూ! (వెంకటనారాయణ వస్తాడు) రా! రావోయి వెంకటనారాయణా! కూర్చో! కూర్చో! అనుమానం ఏమీవద్దు! మనలో భేదాలు లేవు!

అనుమానం



వెంక- అలాగేసార్! అయినా నాకోసం ప్రత్యేకంగా ఒక గదెందుకు సార్? ఏ మూలనాసంచీ పడేసినా రోజు గడిచిపోతుంది!

సీతా- ఆపిచ్చిమాట లేవద్దు! యిక్కడవేమీ పనికిరావు! ఏమి టోయ్! శ్రీనూ! ఏమిటలావుంది ముఖం! ఏమిటాలో చిస్తున్నావ్? వాళ్ళంటే పేమ ప్రవాహంలో కొట్టు కుంటున్నారు! నీకేమయిందోయ్? ముదిరిన బెండకా యలా...

వెంక- అడ్డొచ్చానడకండిసార్! పేమ మహా చెడ్డదిసార్! ఆడా మగా, చిన్నా పెద్దా ఏ తేడాలు లేవండీ!

సీతా- (పెద్దగా నవ్వుతూ) వెంకటనారాయణా! యిన్నేళ్ళా దిగ్గిరేవుంటూ మావాడినోయింటి వాడిగా మార్చలేక పోయావు! ఊ! నిన్నని ఏంలాభం?...వీడినుదుట కళ్యాణ రేఖలేదు! పాపం!

డాక్ట- సీతారాం! నాసంగతి వొదిలేయ్! కావలిస్తే నీదగ్గిరికే వస్తాలే పిల్లని చూసిపెట్టమని!...

సీతా- యిప్పుడు నీకెవరిస్తారోయ్ పిల్లని?... ఏదో నాలాంటి వయసుమళ్ళి పళ్ళురాలిన పసిపిల్ల వస్తేరావాలిగాని వెంకటనారాయణా! మేం చదువుకుంటున్న రోజుల్లో మాక్లాసులో...



డాక్టర్- యిదిగో సీతారాం?

సీతా- చూశావా ఎలా తుళ్ళిపడుతున్నాడో! ఏమ ప్రేమంటే ఏమిటో తెలియని అమాయకుడను కుంటున్నావేమిటీ? కొంపతీసి! నేను చెప్తానిను!

డాక్టర్- చాలించవయ్యా!

సీతా- ఉండవోయ్! అదేం రహస్యం కాదుగా! అందరూ విననీ!... వెంకటనారాయణా! మాక్లాసులో మేరీ అని ఒక కిరస్తానీపిల్ల వుండేది! అది పిణ్ని పాపం మూడు చెరువుల నీరు తాగించి మరీ విడిచిపెట్టింది! ఆదెబ్బ యీనాటికీ తట్టుకోలేక చస్తున్నాడు మనవాడు! అందుకే అంతవిరక్తి!...

డాక్టర్- విరక్తీలేదు-పాడూలేదు... ప్రేమ అనేది మనోదార్బల్యం! ఆత్మవంచనకూడా! ఆమాటలు వాస్తవిక జగత్తులో అర్థంలేని వ్యర్థపదాలు! పిచ్చికూతలు! ఎందుకూ చెందని మాయమాటలు!

సీతా- (చప్పట్లుకొడుతూ) Hear! Hear! డాక్టర్ శ్రీనివాస రావుM. B. B.S. The Famous heart Specialist గారి అమూల్య అభిభాషణలు ప్రేమమీద అపూర్వకర మైన అభిప్రాయాలు!

(గోపాలం వస్తాడు)

అనుమానం 

గోపా- ఫలహారానికి అక్కరమ్మంటుంది నాన్నా!

సీతా- అప్పుడేనా చూశారా ప్రేమభావం యిలా వెళ్ళిందో లేదో అలా అన్నీ తయారైపోయాయి! గోపాలం! వెంకటనారాయణకి ఏంకావాలో చూడూ! రావోయ్ నాయకుడా! (అని శ్రీనివాసరావుని తీసుకొని సీతారామయ్య లోనికి వెళ్తాడు)

గోపా- స్నానం చేస్తావా?

వెంక- అబ్బే! యిప్పుడెందుకుసార్! అక్కర్లేదు! మీతో ఒక విషయం చెప్పాలిసార్!

గోపా- ఏమిటది?

వెంక- చెప్తానుసార్! చెప్తాను! చూశారూ-ఆమార్వాడీ రంగ లాల్ మహాదుర్మార్గుడుసార్! చాలా చెడ్డవాడుసార్!!

గోపా- వాడి మంచిచెడ్డల్తో మనకేంపనీ

వెంక- అంతేననుకోండి! కాని! వాడిదగ్గిర మీరెందుకు అప్పు చేశారుసార్?

గోపా- అప్పుచేస్తే...తీర్చనేమిటి?

వెంక- యెప్పుడు?

గోపా.. తొందరేమిటీ.....వడ్డీ యిస్తానుగా!

వెంక- వాడు నిప్పుత్రొక్కిన కోతిలా చిందులు త్రొక్కుతున్నాడు!

అనుమానం



గోపా- వాడెప్పుడూ అంతేలే!

వెంక- మాతో కూడానే వచ్చాడుసార్ !

గోపా- ఎవరు ...రంగలాలే! యీ ఊరొచ్చాడా!

వెంక- అవునుసార్!

గోపా- చంపేశావ్! కొంపతీసి నాన్నగారితో చెప్తాడేంటి?

వెంక- అందుకే వచ్చాడుసార్

గోపా- నీవు వాడితో మాట్లాడావా!

వెంక- చాలా చెప్పిచూశానుసార్ వినేస్థితిలోలేడుసార్! ఉన్నపాళంగా డబ్బుకట్టకపోతే నాన్నగారితో కలిసి మాట్లాడతాడట!

గోపా- కడ్తానయ్యా!కడ్తాను! కట్టక నేనేం పారిపోతానా! ... ఏదీ నేనింకా గెలవలేదే! అటు ఆడబ్బు అందిన తక్షణం లోనే పీడిబాకీ అణాపైసల్తో జమకడ్తాను! వాడిడబ్బు నాకెందుకు? యీసారి ప్రైజెంతో తెలుసా?...మూడు లక్షలు! నీపేరునా ఒకటి పపించానే! వెధవ-ఆమార్వాడీ గాడి పేరునా ఒకటి పంపించాను తెలుసా?

వెంక- వాడికంతా మొత్తం నాలుగువేల ఆరువందల యిరువై ఆరు రూపాయల చిల్లర యివ్వాలట!

గోపా- ఆ! అంతకాదే! అదేమిటీ? వాడునాకిచ్చినది రెండువేలే అవీ దపదఫాలుగా తీసుకున్నాను.

## అనుమానం





వెంక- ఏమోసార్! ఆ మార్వాడీచేతిలో ఎందుకు చిక్కు-కున్నారుసార్! ఆగోతిలో ఎందుకుదిగారు?

గోపా- బావుందోయ్ నీమాట! నాన్ననాకిచ్చే రెండువందలూ నాఖర్చులకే చాలకపోతుంటే నాకు లాటరీలకు డబ్బేదీ?

వెంక- ఎందుకొచ్చిన దండగఖర్చులండీ యివి?

గోపా- నీకలాగేవుంటుందిలే! అందీ అందకుండా ఆటలాడే అదృష్టం సంగతి నీకెలా తెలుస్తుంది?

వెంక- మీనాన్నగారికి తెలిస్తే యింకేమయినా వుందీ? మీతో మరీ మరీ చెప్పమన్నాడు ఆ రంగలాల్! తెల్లవారేసరికి తనడబ్బు జమ యివ్వకపోతే నాన్నగారితో సంప్రదిస్తా నన్నాడు.

గోపా- చంపేశాడే! యిలా గొంతుమీద కూర్చుంటే...

వెంక- అదొకటి! ఆ చంద్రమ్మ మీకెక్కడ దాపురించింది సార్! ఉట్టి రోగాలపుట్ట! నిన్న ఏకంగా ఆస్పత్రికే వచ్చేసింది మీకోసం! మీబాబయ్యగారి కంటబడ్తుందేమో అని భయం వేసింది!

గోపా- ఎందుకొచ్చింది?

వెంక- మీరు చెప్పకా చెయ్యకా వచ్చేశారు! మీరు కనిపించ లేదని... నేనేం వివరాలు చెప్ప లేదు-ఘాటుగా చీవాట్లు పెట్టి పొమ్మన్నాను!

గోపా- దాని సంగతికేమొచ్చిందిప్పుడు? ... యీ మార్వాడీ వెధవని ఎలా తప్పించుకోడం? నాకేమీ తోచడంలేదు ఏమిటిచెయ్యడం వెంకటనారాయణా!

వెంక- ఏంచేస్తారుసార్! కాళ్లావేళ్లాపడి తాపీగా యిస్తానని బ్రతిమాలండి! గోకులవిలాస్ హోటల్‌లో దిగుతానని అన్నాడు! వెళ్ళి స్వయంగా మాట్లాడండి! వాడిక్కడి కొస్తే నానా గల్లంతు అవుతుంది!

గోపా- రేపు తెల్లవారితే యింటినిండా జనంవుంటారే! ... స్నేహితులూ, బంధువులూ ... వాడు ఆలోచించుకొనే వచ్చినట్టున్నాడు! పరువుతీసి బజార్లో వెయ్యాలని వాడి అభిప్రాయమనుకుంటా!

(హేమ 'జిలిబిలిపున్నమ' Hum చేస్తూ వస్తుంది. సోఫాలో కూలబడిపోయిన గోపాలంని చూస్తుంది)

హేమ- ఏమిటో ఆ ఆలోచనలూ! ఫలహారం తీసుకోవా?... వెంకటనారాయణా! ఫలహారానికి వెళ్ళు-వెళ్ళో! వెంకటనారాయణ్ని కూడా తీస్కెళ్ళు.

(గోపాలం, వెంకటనారాయణ వెళ్తారు హేమ ఉత్సాహంగా వుంటుంది కిటికీలోంచి తోటలోనికి చూస్తుంది అద్దంచూచి తల సవరించుకుంటుంది Hum చేస్తుంది క్రమంగా "తన్మయంతో పాడ్తూ అనుగుణ్యంగా నాట్యం చేస్తూంది")

## అనుమానం



జిలిబిలి పున్నమ నేడుగదా-లే
వలపుల వెన్నెల విరిసెగదా ||జి||
నా హృదయాకాసములోన సదా
నాప్రేమ శశాంకుడె నిలిచెగదా ||జి||
ఆనందపు టందెల సందడులే
నాడెందములోపల చిందెగదా ||జి||
ఈ అందము యేవన ప్రేమసుధల్
నవనందన సీమలవిందుగదా ||జి||
యీరోజా యీరోజే విరబూచెగా
యీరోజే నారాజూ ననుజూచెగా ||జి||
మదిలో ఊయెలలూగెనే కోరికల్
ముదమార యిలపాడెనే కోకిలల్ ||జిలి||

'జిలిబిలి పున్నమ నేడుగదా'

పాట పూర్తవుతుంది తెరజార్తుంది!)



 అనుపానం

## మూడవ దృశ్యం

(రెండవ రంగంలోనిదే గది: రాత్రి పదకొండు దాటింది. ఎలక్ట్రిక్ దీపం వెలుగుతూటుంది. కిటికీలోంచి, కొబ్బరిఆకుల సందుల్లోంచి చంద్రుడు కనిపిస్తుంటాడు. కిటికీదగ్గర వెన్నెలలోనికి చూస్తూ హేమ నిల్చొనుంటుంది. సోఫాలో తలపట్టుకొని శేఖరం కూర్చొనుంటాడు. తెరలేచేటప్పటికి హేమ చిలిపిగా శేఖరం దగ్గరి కొస్తుంది.)

హేమ- అదేం? అలా వున్నారేం? తలనొప్పిగా వుందా?... ఒక్కసారి యిలావచ్చి చూడండీ! ఎంత ప్రశాంతంగా వుందో రాత్రి! ఎంత హాయిగావుందో వెన్నెల! (సోఫాలో శేఖరం ప్రక్కనే కూర్చొని) ఎందుకొచ్చిన దీపాలివి చెప్పండీ! ఆ చందమామముందు దిష్టిపిడతలు కాదూ!...లోకం ఏమనుకుంటుందో అని భయపడుతున్నా కాని ... నా కేమిటి చెయ్యాలనివుందో తెలుసా!

శేఖ- (తలెత్తి) ఏమిటి!

హేమ- యీ దీపం ఆర్పేసి, చీకట్లో, ఆ చంద్రుని చూస్తూ కూర్చోవాలనుంది!

శేఖ- సరే! అలాగే కూర్చో! నేను వెళ్ళిపోతాను! ఒంట్లో ఎలాగో వుంది!

హేమ- (ఆతురతో) ఏమయింది? బాబయ్యగార్ని పిలిచేదా?



శేఖ- అబ్బే! అక్క ర్లేదు... ఏదో ఆలోచనలు! ఆలోచనలు! తల తిరిగిపోతున్నట్టు భ్రమ!

హేమ- ఎందుకలా ఆలోచిస్తారు? నాకుమాత్రం ఆలోచనలు లేవనా? నిజానికి ముళ్ళమీద వున్నట్టుంది నాకు... ఎప్పుడు తెల్లవారుతుందా అని...

శేఖ- ఎప్పటికీ అసలు తెల్లవారకుండా, యిలాగే రాత్రిగా వుండిపోతే...

హేమ- అబ్బో! ఎంతాశ? చాలా పెద్దకోరికే!

శేఖ- కాదు హేమూ! తెల్లవారడం అంటే ఒకరోజు గతించి పోయిందన్నమాట! ఒకరోజు మనజీవితంలోనుంచి జారిపోయిందన్నమాట! చావునోటికి యింకొంచెం దగ్గిరిగా వెళ్ళామన్నమాట! ఒకరోజు...

హేమ- చాల్లెండి మీమాటలు! మీకు వేదాంతం తలకెక్కినట్టుంది యీమధ్య! ఏమిటామాటలూ! మనం చలనం లేని రాళ్లూ రప్పలం కాంకదా! కలకాలం ఒక్కలాగే నిలిచిపోడానికి!... లెండి! యిక్కడుంటే మీకిట్లాగే వుంటుంది! అలా తోటలోనికి వెళ్లొద్దాం రండి! మీ మనస్సు ఆవెన్నెల్లో చల్లబడుతుంది!

శేఖ- చాల రాత్రయిపోయింది! యిప్పుడు తోటలోనికి వెళ్లడం?... వద్దు! వెళ్ళిపడుకో! తెల్లవారితే పాపం బోలెడు పనులున్నాయి నీకు!

హేమ- నిద్రరావడంలేదు! అందుకనే యిక్కడికొచ్చాను!

శేఖ- ఎవ్వరైనా మనల్నిచూసి ఏమయినా దురభిప్రాయ పడగలరు!

హేమ- ఏమిటని?... చెప్పండి! చెప్పరేం?

శేఖ- నీవంతంనీ దేకదా!

హేమ- అదికాదండీ! మనం ఏంతప్పుపని చేశామనీ? యింతకీ యిప్పుడెవరున్నారు ఎలాంటి అభిప్రాయపడడానికైనా పగలు మనం మాటాడుకోవడంలేదూ? మన యిద్దర్నీ ఒంటరిగా వొదిలి ఒక్కొక్కప్పుడు అందరూ వెళ్ళిపోవ డంలేదూ! అది తప్పుకాదూ? యిప్పుడు మనం యిక్క డుండడం నేరం అవుతుందా? యింతకీ నాన్నగారికి మన మీద నమ్మకంవుంది! యితర్లలక్ష్యం మనకేల?

శేఖ- బావుంది నీవాదన!

హేమ- వాదనకాదు... నేను ఏతప్పూ చెయ్యడంలేదు! అది నాఆత్మకి తెలుసు! ఒకరికి సంజాయిషీ యిచ్చేకర్మ నాకెం దుకూ?

శేఖ- ఆ! సంజాయిషీ యిమ్మని నీకడుగుతాను!

హేమ- మీతో నేను వాదించలేను! మీ భావం నాకు తెలుసు! నన్నెలాగయినా తప్పించుకోవాలని మీరు చూస్తు న్నారు! మునపటిలా మనసువిప్పి మాట్లాడ్డంలేదు!



కావాలని నన్ను బాధపెడుతున్నారు! మీ మాటలూ, మీ చేతలూ అన్నీ నన్ను బాధపెడ్తున్నాయి. సాధ్యాహ్నం మీతో వివరంగా మాట్లాడే అవకాశం దొరకలేదు. యిప్పుడు యీ క్షణాన్ని పోగొట్టుకోలేను! మీ రెందుకిట్లా నన్ను ఏడిపిస్తున్నారో చెప్పితీరాలి!

శేఖ- హేమా! నీ కెందుకా పిచ్చిఅనుమానం?

హేమ- అనుమానమా? ప్రత్యక్షంగా అనుభవిస్తున్నదానినే అనుమానం అంటారా? మీ హృదయాన్ని అడగండి; మీ మాటలలో నిజముందేమో! నా ముఖంచూసి ఒట్టువేసి చెప్పండి; మీరు నిష్కపటంగా మాట్లాడుతున్నారా? చెప్పరేం? చెప్పరేం? నాకు తెలియదనుకున్నారా? నాకు తెలుసు? మీరేదో దాస్తున్నారు!

శేఖ- హేమా! హేమా!

హేమ- అవును దాస్తున్నారు! ముమ్మాటికీ నిజం! చూడండి రేపు మనిద్దరి జీవితాలు ఒకటిగా నిర్ణయించే ప్రధాన దినం! ఆ దినంకోసం యిన్నాళ్ళూ కలలుకంటూ తపస్సుచేశాం! ఆ దినంకోసం అంతులేని ఆశతో ఆత్రుతతో వేచియున్నాం. ఆ పవిత్రముహూర్తం సమీపిస్తుంటే మీరు యిలా మారిపోయి నాకు దూరం అయిపోతున్నారేం?

శేఖ- లేదు! లేదు! హేమా! లేదు! నీవు నన్ను అపార్థం చేసుకుంటున్నావు! నేను! నేను...

హేమ- ఎందుకలా మాటలకోసం వెనుకాడుతారు? మీసం దేహంలోనే కనిపిస్తోంది మీ అయిష్టత! నిజం చెప్పండి! దేవునిముఖంజూచి నామీద ఒట్టేసి చెప్పండి! ఎందుకు మీరు మారిపోయారు?... చూడండీ! మీకు యిష్టం లేని పని బలవంతంగా నేను చెయ్యించగలనా? చేయమంటానా? చెప్పండి! నామీద మీకు మొదట్లో ఉన్న అభిమానం మారిపోయుంటే, నేను మీకు ఏమీ కాకపోతే మీకు నేను బరువూ భారంగా మారిపోతే యిప్పటికేమీ మించిపోలేదు! మిమ్మల్ని నిర్బంధించను! ఏమీ అడ్డుచెప్పను! మీరు నాకిచ్చిన మాట మీద నిలబడమని బలవంతం చెయ్యను!

శేఖ- హేమా! చాలు! చాలు! ఎందుకిలామాటలతో నన్ను చంపుతావు? ... ఇది ధర్మంకాదు! నేనేం పాపం చేశాను! భగవంతుడా?

హేమ- ఎందుకా అనుతాపం? నేను నిజం చెపుతున్నాననా? రేపే ఆ తతంగం కాస్తాపూర్తయినతరువాత విచారించి ఏం ప్రయోజనం? మీలో మీరు చింతిస్తూ కొనవిరిగి బాధపడుతుంటే నాకెలావుంటుందో ఆలోచించారా?



మనస్పూర్తిగా మీకు ఏమిటి చెయ్యాలనుందో అది చెయ్యండి! నేనేమీ అభ్యంతరం చెప్పను.

శేఖ- హేమా! యివి నీ హృదయపూర్వకంగా చెవుతున్నావేనా? చెప్పు! నిజంగా యీ మాటలు నీ హృదయం లోంచి వస్తున్నవేనా?

హేమ- హృదయం! ఎవరికి కావాలి నా హృదయంసంగతి. పాడుహృదయం! యిల్లాంటి పిరికిహృదయం ఏమయిపోతేనేం? కావాలిసినదే! ఏ జన్మాన ఎవరికి కలిగించిన...

శేఖ- హేమా! ఏంటామాటలూ! ఉద్రేకంలో విచక్షణ మరిచిపోతున్నావ్! ఎన్నిసార్లు చెప్పాను. అహర్నిశాలూ నీ కోసం నీ ఆనందంకోసం, నీ క్షేమంకోసం నేను తపిస్తూ తపస్సు చేస్తున్నానని - ఎన్నిమార్లు చెప్పాలి! నీ కర్థంకాదు హేమా! నా బాధ నీ కర్థం కాదు!

హేమ- ఆ! ఎందుక్కాదూ? మీ తీరు చెప్తూందిగా!

శేఖ- హాస్యంకాదు హేమా! నీకు అణుమాత్రం దుఃఖం కలిగితే నేను భరించలేను. నీవేమాత్రం కష్టపడినా నేను సహించలేను! నేను సర్వదా కోరేది నీ క్షేమం, నీ ఆనందం! నీ సుఖం! యింతకంటే వేరింకేమీ నేను

చెప్పలేను! నా మాటలు నమ్ముతావా? నమ్మ...
నన్నింక వేధించకు!...

హేమ- నేను వేధిస్తున్నానా? నిజంగానా? చూశారా నాలో ఎంత స్వార్థంవుందో? ఎంతసేపూ నా సంగతేకాని మీకష్టాన్ని గమనించలేను కదూ! నాబాధ, నాసొద, నాగొడవఅంతా నాదేతప్ప మిమ్మల్ని అర్థంచేసుకోడానికికూడా ప్రయత్నించలేదు అవును! ఉడుకుమోత్తుతనంతో, ఉక్రోషంతో మీకు బాధకలిగించాలనే అనుకున్నాను! తెలియకచేసిన అపచారం! క్షమించండి! క్షమించరూ! కోపమా!

శేఖ- పిచ్చిదానా! యింతలోనే అనుతాపమా? నాసర్వం నీ అధీనంచేసుకున్నావు! నీమీద నాకా కోపం? ఏమనడానికైనా నీకు సంపూర్ణాధికారంవుంది!

హేమ- వద్దు బాబూ! వద్దు! నాకంత పెద్దఅధికారం అక్కర్లేదు. మీపాదాలచెంత ఆపాటిచోటిస్తే చాలు! వేరేయింకేమి అక్కర్లేదు! అంతమాత్రానికే మీరింత బేరాలాడుతున్నారు!

శేఖ- ఛా! అదేమీ లేదు! చాలరాత్రయిపోయింది! వెళ్ళి పడుకో!

హేమ- మీరో?

## అనుమానం

శేఖ- నాకేం? యీసోఫాలో యీరాత్రిగడిపేస్తాను!

హేమ- నిద్దరొస్తూవుందా? యిప్పుడెలావుంది తలబాధ? కొంచెం రాసేదా?

శేఖ- ఒద్దు! ఒద్దు!

హేమ- ఎందుకాకంగారు? నేనేం భూతాన్నా?

శేఖ- ఛా! ఛా! ఏంటామాటలు?

హేమ- అలాతోటలోనికి వెళ్దాంరాకూడదూ? రండీ ఒక్క రెండునిముషాలు వెన్నెలలో చల్లగా...

శేఖ- యీవేళప్పుడు తోటలోనికా? నీకేమయినా మతిపోయిందా? పురుగూపుట్రా వుంటాయి.

హేమ- తోటలోకాదు మీమనసులోవున్నాయి! తెల్లవారేదాకా మినుగురుల్ని తారల్ని లెక్కబెట్టూ తోటలో గడిపినరాత్రులు మరిచిపోయారు! మంచుతోతడిసిన గరికలో ఎన్నరాత్రిలు మనంగడపలేదు? యీవేళేనా పురుగూపుట్రిలు అడ్డువచ్చాయి? ఎందుకాసాకులు! రానని చెప్తే పోయిందానికి!

శేఖ- నాకు నిద్రవస్తున్నది!

హేమ- అదృష్టవంతులు! యీవేళనాకు నిద్రిదేవత దూరం అయిపోయినట్టుంది! యీవొక్క రాత్రిగడిస్తే రేపు ఆనుఘురమధుముహూర్తంతో మనయిద్దరికీ ఎన్నటికీ తెగని బంధం ఏర్పడుతుంది! మీ యీదనాకూ! నా

మీాద మీాకూ ఎన్నటికీ తెగని అనుబంధం! చివరికి మరణం మనమధ్య నిలిచినా తెంచలేని శాశ్వత సమ్మంధం!

శేఖ- నిజం! అవును నిజం. నిజం చెప్పావు హేమా! మరణం మనమధ్యనిలిచినా తెంచలేని శాశ్వతసంబంధం! రేపు రేపే ఆబంధానికి ఆకారం ఏర్పడుతుంది? రేపు?

హేమ- అందుకని యీామిగిలిన రెండుఘడియలూ యీాకొద్ది క్షణాలూ స్వేచ్ఛగావుందామని మీాకుందా! పోని లెండి! అలాగేవుండండి! రండి తోటలోనికెళ్ళివద్దాం.

శేఖ- వద్దు! హేమా! వద్దు! నామాటవిను! నిద్రలేకపోవడం వల్ల ఎలాబరువెక్కి గులాబీ రేకుల్లావున్నాయో నీ కళ్ళు!

హేమ- చాల్లెండి మీావర్ణన! నిద్రలేక కాదు .:. ...

శేఖ- యింకా నామీాద కోపంవుందా హేమా!-లే! ... పద! వెళ్ళిపడుకో! (లేస్తాడు-హేమని ద్వారంవేపు తీస్కెళ్తూ) వెళ్ళు ఏకలలూ ఏకలతా లేకుండా హాయిగా నిద్రపో! వెళ్ళు!

హేమ- అబ్బ! ఎంత కఠినాత్ములండీ మీారు! మీాగదిలోనికి మీారు వెళ్ళరా?

శేఖ- అక్కడికి వెళ్లే ఓపిక లేదు!



హేమ- నేను సాయం వస్తానన్నానుగా!

శేఖ- అబ్బ! వెళ్ళమంటే!

హేమ- సరే! ఆజ్ఞ! రేపట్నుంచీమూస్తా ఎలా నన్ను ఒంటరిగా తరిమేస్తారో!...కప్పుకోడానికీ శాలువా తెచ్చిస్తా (హేమ వెళ్తుంది ద్వారందాకా హేమను సాగనంపి తిరిగొచ్చి బరువుగా సోఫాలో తలపట్టుకొని కూలబడ్తాడు! నిర్ధారణకొచ్చి లేచి ద్వారంవేపు వెళ్ళబోతాడు.)

### * నేపథ్యగీతం *

స్త్రీకంఠం- ఆగుమోయీ పరారీ!...
పురు- సాగుమోయీ తెరువరీ!
స్త్రీ- పారిపోకోయీ పరారీ...
పురు- సాగిపోవోయీ తెరువరీ!
స్త్రీ- ఊరువిడిచి దూరముగా, పరపంచల భారముగా
నిరాశల పరంపరలోనలిగే బ్రతుకేలనోయీ।ఆగు।
పురు- సుడిగాలి పొడతగిలి
తొడిమవీడిన ఫలము
తొడిమతో కడసారి నుడివిపోతుందా?॥
స్త్రీ- సరివారల మరియాదల పరివారపు గురుభారపు
టురిలో ఊపిరి తిరగక విరక్తితో పరుగెత్తకు॥ఆగు॥

 అనుమానం

పురు- చిత్తస్వాతులు కలిసి
హత్తుకొన ముత్తెపు
చిప్పలో రాలింది చినుకొక్కటీ-
ముత్తెమే మున్నీట మునిగిపోయేనాడు
చిప్పతో కడసారి చెప్పిపోతుందా ॥సాగు॥

స్త్రీ- ఆగుమోయీ పరారీ!

శేఖరం సందిగ్ధంలో ఊగులాడ్తూ - ద్వారంవేపు వెళ్ళబోతాడు. హేమలత శాలువతో యెదురౌతుంది.

హేమ- యేమిటీ యెక్కడికి వెళ్తున్నారూ?...

శేఖ- అబ్బే! యెటూలేదు...తలుపులు వేద్దామని...శాలువా తెచ్చావా? Thanks వెళ్ళిపడుకో! వెళ్లూ లైటార్పేస్తున్నా (లేచి Switch off చెయ్యబోతాడు- బరువుగా హేమ కదలబోతుంది-ద్వారం దగ్గిరికి హేమ వెళ్ళేసరికి లైటారిపోతుంది హేమ ఒక్క పరుగునవచ్చి శేఖరం హృదయంమీద ఉప్పెనలా వాలిపోతుంది. వెక్కి వెక్కి యేడుస్తుంది చీకట్లో.)

శేఖ- యేమిటిది?... పిచ్చిదానా ఎందుకా ఏడుపు? ఎందుకీ యేడుపు?...ఏం యిలా వణికిపోతున్నావ్: ఊరుకో! ఛీ! ఏడుస్తావెందుకు?

హేమ- ఏమిటో! నాకు భయంగావుంది! మనస్సు ఆందోళనతో నిండిపోయుంది! మీరు నాకు అన్యాయం చెయ్యకండి! నాకు దూరం అయిపోకండి చెప్పండి! చెప్పండి!



చూడండి! నాకు ద్రోహంచేస్తారా? చెప్పండి! ద్రోహం చెయ్యనని చెప్పండి! ఆమాట ఒక్కటి మీనోటితో చెప్పండి! (శేఖరం గుండెలమీద ముఖం దాచుకొని వల వల ఏడుస్తుంది)

శేఖ— (బాధతో ఊగిపోతూ) హేమా! హేమా! యీ అల్పుని కోసం నీవింత బాధపడాలా?...నీకు నేను ఏనాడయినా ద్రోహం చెయ్యగలనా? నా ప్రాణానికి నువ్వు! నువ్వు నా స్వప్నానివి! ఊరుకో! ఊరుకో! నామీద కనికరించి ఏడుపు ఆపు! పద! పద! నడు (భుజంమీద చెయివేసి నడిపిస్తూ తీసుకెళ్ళాడు గదిలోనికి. ఒక్క క్షణం చీకటి...తలుపులు మెల్లగా విడతాయి. శబ్దంకాకుండా అడుగులువేస్తూ గోపాలం ప్రవేసిస్తాడు...స్విచ్ దగ్గిరికివెళ్ళి లైటువేస్తాడు. ముఖంలో చెమట కారుతుంటుంది! గాభరాగా యిటు అటు చూచి యినపెట్టెదగ్గిరికి వెళ్తాడు. జేబులోంచి తాళంతీసి ఊపిరి బిగబెట్టి యినపెట్టె తెరచే యత్నంలో వుంటాడు ద్వారంలోంచి తెరను లేపేస్తూ విసురుగా గాలి వస్తుంది. తృళ్ళిపడి తిరిగిచూస్తాడు. ఒక్కగంతులో వెళ్ళి తలుపులు జేరవేస్తాడు. తొందరగా తొందరగా యినపెట్టిదగ్గిరికి వెళ్ళి తాళంత్రిప్పి తలుపులు తెరుస్తాడు లోన చెయ్యిపెట్టి నోట్ల కట్టలు ఒకటొక్కటే తీసి దొంతరగా పట్టుకుంటాడు రెండో చేతితో తలుపులు వెయ్యబోతుంటే ద్వారందగ్గిర చప్పుడౌతుంది తిరిగి చూస్తాడు భయంతో గదిలో మూసిన తలుపులముందు చేతులు కట్టుకొని శేఖరం నిల్చొని వున్నాడు.)

అనుమానం

గోపా- (భయంతో వణికిపోతూ నిల్చుంటాడు నోట్లకట్టలు చేతిలోంచి జారిపోతాయి వొణుకుతూ) శేఖరంగారూ!

శేఖ- గోపాలం! ఏమిటీపని?

గోపా- (ఏడుస్తూ శేఖరం కాళ్ళమీద పడ్తాడు) శేఖరంగారూ! నన్ను రక్షించాలి! నన్ను కాపాడాలి! నాన్నతో చెప్పకండి చంపేస్తాడు!

శేఖ- ఆభయముంటేనా యీపని చేస్తున్నావ్? నీకేమయినా మతిపోయిందా? లే! లే!

గోపా- మీరు మాటయివ్వండి! యింకెప్పుడూ యిట్లాంటిపని చెయ్యను!

శేఖ- యిప్పుడెందుకుచేశావ్? లే!

గోపా- (లేచి) యేంచేసేదిచెప్పండి శేఖరంగారూ! ప్రాణాలు మీదికొచ్చింది. ఆమార్వాడీవెధవ గొంతుకమీద కూర్చున్నాడు. వాడిబాకీడబ్బివ్వకపోతే నాన్నగారితో చెప్పేస్తానని అన్నాడు!

శేఖ- ఎవరా మార్వాడీ?

గోపా- వాడిదీవూరుకాదండీ! రామచంద్రపురం.

శేఖ- నీవు వాడికి బాకీవున్నావా?

గోపా- అప్పుడప్పుడు వాడిదగ్గరతీసుకున్న బాపతు.

శేఖ- ఎంతివ్వాలి?



గోపా- నిజానికి నేను తీసుకున్నది రెండువేలకిమించదు యిప్పుడాగాడిదకొడుకు నాలుగువేలచిల్లరబాకీ తెమ్మంటున్నాడు.

శేఖ- ఆడబ్బంతా యీలాటరీకేనా పోశావు? యిలాగే ఏనాడో కొంపమీదికి తెచ్చుకుంటావని అనుకుంటూనే వున్నాను.

గోపా- మీకాళ్లుపట్టుకుంటాను! మీకుపుణ్యముంటుంది నాన్నతో చెప్తానన్నాడు. యీగండం తప్పించండి!

శేఖ- (ఆలోచిస్తూ) గోపాలం ... ఒక్కషరతుమీద నీకు సాయంచేస్తాను.

గోపా- షరతా? ఏమిటది? చెప్పండి?

శేఖ- బాగాఆలోచుకో! యిది మీఅక్కతో సమ్మంధించినదిసుమా!

గోపా- అక్కతోనా?

శేఖ- గోపాలం! నేను హేమకి మోసంచేశాను!

గోపా- మోసంచేశారా? మీరా?

శేఖ- అవును! మోసంచేశాను! యిప్పుడుఅంతామించిపోయిన తర్వాత అనుతాపపడుతున్నాను.

గోపా- అక్కకి యీసంగతితెలిస్తే గుండెబద్దలై చస్తుంది!

శేఖ- అందుకే నీసహాయం కోరుతున్నాను. రేపుప్రధానం! అది తప్పించాలి. తప్పించడానికేవచ్చాను. నాకు శక్యం

13



కాలేను. ఎలాగైనా తప్పించితీరాలి. హేమని నేను పెళ్ళాడలేను. కారణం అడగకు... అది నానోటితో హేమకి చెప్ప లేక పోయాను ఆమాటలు చెప్పి ఆహృదయంబద్దలుచేసేశక్తి నాలో లేదు.

గోపా- అయితే నేనేంచెయ్యాలి?

శేఖ- ఏమీ చెయ్యక్కర్లే...నీకు కావలసినడబ్బు నేనిస్తాను. హేమమనస్సులోనుంచి నాస్మృతుల్ని తప్పించడానికి నీవు సహాయపడాలి... యీదొంగతనం నేను చేశాను.

(అంటూ వంగి నేలపడిన నోట్లకట్టలుతీస్తాడు)

గోపా- ఏమంటున్నారు? నానేరం మీమీద వేసుకుంటారా? శేఖరం గారూ మీకేమయినామతిపోయిందా!

శేఖ- (బ్రతిమాలుతూ) నామాటవిను!

గోపా- వీలులేదు! నాచేతకాదు! నేనీపనికి ఒప్పుకోను!

శేఖ- ఆలోచించు (అంటూ యినప్పెట్టెదగ్గిరకెళ్తాడు) బాగా ఆలోచించు దొంగననే సాకుతో హేమనుంచి దూరంగా వెళ్ళిపోతాను నాకెంతో మేలుచేసినవాడివవుతావు. వెయ్యి! కేకలువెయ్యి! నలుగుర్నీ పిలువు మీఅక్కజీవితం కాపాడినవాడివవుతావ్!

శేఖ- (భయంతో వారించుతూ) శేఖరంగారూ! శేఖరంగారూ! యిలాచెయ్యమంటం న్యాయమా? ఒద్దు! నామాట వినండి! ఏవిటిచేస్తున్నారు? శేఖరంగారూ! ఛీఛీ యిది



మీకున్యాయం కాదు! (తలుపులు ధఢేలుమని తెరుచుకుంటాయి సీతాయమ్య లోనికివస్తాడు. శేఖరంని యినప్పెట్టెదగ్గిరచూచి తనకళ్ళనుతానే నమ్మలేకపోతాడు)

సీత- ఏమిటిది? ఏమిటీపని? శేఖరం... ఏమిటీ అఘాయిత్యం! (ఉద్రేకం కోపంగామారుతుంది) నీచుడా! దౌర్భాగ్యుడా! మాట్లాడవేం? ... యిందుకా మాయింట్లో చేరావ్? యిందుకేనా నాకూతుర్ని ప్రేమిస్తున్నట్లు మాయ వేషాలువేశావ్? మోసగాడా! (శేఖరం తలదించుతాడు. నోట్లకట్టలు జారిపోతాయి)

గోపా- నాన్నా నాన్నా ... నేను నేను ...

సీత- నువ్వింకేమీ నాకుచెప్పనక్కరలేదు! అంతా అర్థమైంది అడిగితేయివ్వనూ దొంగతనం చేస్తావా? ద్రోహీ! నీ మాయల్లోపడి హేమగొంతుకకోశానుకాను యింకా నయం. ముందుగానే కళ్ళు తెరిపించావ్! దుర్మార్గుడా! అదెంతగుండెపగిలి దుఃఖిస్తుందో ఆలోచించావ్? ఎంత పనికి సాహసించావ్! అబ్బ ఎంతమోసం! వెధవడబ్బు కోసంనాచిట్టితల్లిబ్రతుకు పాడు చెయ్యాదలచుకున్నావా? దానిబ్రతుకులో నిప్పవెయ్యతలచావా? ఛండాలుడా! బద్మాష్! దగుల్బాజీ!

గోపా- నాన్నగారూ! కేకలువెయ్యకండీ!

సీత-అవును! యీఘనకార్యం నలుగురికి తెలిస్తే నాకే నగుబాట్లు పో! దుర్మార్గుడా! పో! నీముఖంచూపించకు! (గోపాలం



సన్నగా జారుకుంటాడు) ఫో? ఫో! కన్నకొడుకుకంటె అభిమానంతో ఆదరించానే, పువ్వుల్లో పెంచి, నాప్రాణ సమానంగాచూచే నాకూతుర్ని నీకివ్వదలచినందుకు యిదా నువ్విచ్చే ప్రతిఫలం? దుర్మార్గుడా! ఛీ! ఫో! తక్షణం వెళ్ళిఫో!

(డాక్టరూ, హేమ, వెంకటనారాయణా లోనికి తొందరగా వస్తారు)

డాక్ట- ఏమయింది? ఏమయింది?

హేమ- ఏమిటినాన్నా ఏమిటా కేకలు?

వెంక- ఏమిటిసార్! యింతరాత్రియింది యింకా మేలుకొనే వున్నారా? ఏంటీ కేకలు?

సీత- (దుఃఖంతో) చూడండి! అటుచూడండి! నాకొంపలోనికి నవ్వుతూప్రవేశించిన దుష్టగ్రహం మాబ్రతుకుల్లోనికి మాయచేసిప్రాకిన కాలసర్పం!

హేమ- నాన్నా! ఏమిటంటున్నారు? ఏమిటయింది? ఎవరూ మాటాడరేం? ఏమండీ (అని శేఖరందగ్గిరికి వెళ్ళుంది శేఖరం అవమానంతో ముఖం తిప్పుకుంటాడు)

సీత- అమ్మా! హేమా! యిటురా! కళ్లుతెరిచిచూడూ! పెద్దమనిషిలావచ్చి మనల్ని నాశనం చెయ్యాలనుకున్న యీ పెనుభూతాన్ని! అదృష్టవంతులం! నీబ్రతుకు బ్రద్దలైపోలేదు!

## అనుమానం



హేమ- నేనునమ్మను యిదపీడకల యిదినిజంకాదు! బాబయ్యా మీరుచెప్పండీ! ఏమిటిది?

డాక్టర్- గాభరాపడకమ్మా! సీతారాం! ఏమిటయింది?

సీత- ఆపాటి అర్థంకాలేదూ! నానోటినే చెప్పించాలా? అదుగో తెరచిన యినప్పెట్టె- యిదిగో పెట్టెలోని నోట్లకట్టలు- మీయెదుట్నే తలదించుకొని నిలుచున్న కథానాయకుడు! యింకా నేనేమి మీకువివరించి చెప్పేది?

హేమ- నిజమేనా? యిదిసత్యమేనా? యీఘంటాలప్పనిమీరు చేశారా? చెప్పండీ! అయ్యో! నాన్నా! నాన్నా!

సీత- ఊరుకో! అమ్మా! ఊరుకో! భగవంతుడు మనయందున్నాడమ్మా! ఏడవకు! ఊరుకో! పదలోనికిపద!

హేమ- ఉండండి! ఒక్కమాట! ఏమండీ! మీనోటంట ఒక్కసారి చెప్పండి! ఎందుకీపనిచేశారు?

శేఖరం- (భరించలేనిబాధతో) నేనుదొంగని! నేను పాపాత్ముణ్ని! నాముఖంచూడొద్దు! నన్నుకొట్టండి! నరకండి!చంపండి పోలీసున్ని పిలిపించండి! (ముఖంకప్పుకుంటాడు)

హేమ- బోధపడింది! నాకు తెలిసింది! యీపని మీరెందుకు చేశారో అర్థమైంది.

శేఖ- హేమా! వెళ్ళిపో! వద్దు! నాముఖంచూస్తేపాపం! నన్ను కనికరించకు! నరకంలోనన్ను ...

అనుమానం

సీత- పిరికిసన్యాసి! నీకపటం, నీనటనచూచి విడిచిపెడ్తున్నా నను కోవద్దు! పో! ఒక్కమాటజ్ఞాపకంవుంచుకో! మళ్ళీ నీముఖం కనిపించిందంటే కుక్కల్తో కరిపించిచంపిస్తా! పదమ్మాపద యిదంతా ఒక అనుభవం! శ్రీనూ యీ మృగాన్ని బైటకునెట్టి తలుపులువెయ్యండి! అమ్మా! రా! అసలుదోషంనాదే! ముఖంచూచిమోసపోయాను. పద!

(హేమనుతోసుకుంటూ లోనికి వెల్తాడు శేఖరం నీరసంగా జోగి పోతూ నిల్చుంటాడు)

డాక్ట- (శేఖరంభుజంమీద చెయ్యివేసి) అబ్బాయీ! ఏమిటీపని? నాకేమీ అర్థంకావటంలేదు!

వెంక- అవునుసార్! ఛా!ఛా! యిదేం బాగులేదు సార్!

డాక్ట- ఛా! తెలివితక్కువ పని

శేఖ- (నీరసంగా నవ్వుతూ) మీరు కోరినది జరిగిందిగా, హేమకీ నాకూ యిక శాశ్వతంగా తెగిపోయింది!

డాక్ట- బావుంది! అందుకు యీవెధవపని చేస్తావా? పిరికితనం మూర్ఖత్వం!

శేఖ- నిజం! ఆ పిరికితనమే యిందుకు నన్ను ప్రోత్స హించింది. హేమముఖంచూస్తూ నా నిజస్థితి చెప్ప కోలేక పోయాను. తెగించి చెప్పి హేమ అర్థంచేసు



కొని నన్ను విడిచిపెట్టదనే అనుమానం కలిగింది. హేమ బలహీనం ఆధారంగా చేసుకొని, నాస్వార్థం కోసం ఆమెను బలిచెయ్యలేక పోయాను. యిప్పుడా హేమ దృష్టిలో నేనొక నేరస్తున్ని దోషిని! అంటరాని వాణ్ని ఆమె భావనలో నేనిప్పుడు చండాలుణ్ని దొంగని, నీచుణ్ని! కళ్ళు మూసుకొని దిగదోతున్న నరకంలో నుంచి హేమను తప్పించాను. అంతేచాలు! హేమ నిన్నే మనుకున్నా ఫరవాలేదు.

వెంక- నిజం చెప్పేదా నేను నాఅనుమానం ఏమిటంటే యీ పని...గోపాలం బాబుగారిది

శేఖ- కాదు! కాదు! నేనే చేశాను! నేనే దొంగను.

వెంక- మూమ్మాటికీ మీరు కాదు నాకు తెలుసు!

శేఖ- కాదు! అబద్ధం! నీమాట నిజంకాదు!

డాక్ట- సరే! దానికేం! హేమని యీవిధంగా రక్షిద్దామనీ నీ ఉద్దేశ్యమా? శేఖరం యిదంతా భ్రమ! నీ నటన సరిగ్గాలేదు! నిజాన్ని దాచటానికి ప్రయత్నించకు!

శేఖ- డాక్టరుగారూ! మీదగ్గర దాయటానికేముంది!

డాక్ట- అంటే గోపాలం నన్నమాట యిదంతా!...

శేఖ- డాక్టర్ గారూ! నేను కోరే అవకాశం దొరికింది! మీ ఆదేశాన్ని అక్షరాల పాటించే అదృష్టం ఎలా విడచి





పెట్టగలను! అందుకే అబద్ధంఆడి యీనాటకం ఆడవలసి వచ్చింది!

డాక్ట- శేఖర్! నిన్ను అర్థం చేసుకోలేకపోయాను! నన్ను క్షమించు! భగవంతుడు నీకు అన్యాయంచేశాడు నీ ఉదారత్వాన్ని, బ్రహ్మాండమైన త్యాగంకోసం కసాయి తనంతో బలవంత పెట్టినందుకు నన్ను మన్నించు! క్షమించు!

శేఖ- డాక్టర్ గారూ! మీధర్మాన్ని మీరు చేశారు! నాకర్త వ్యాన్ని నాకు బోధపరిచారు!... సెలవు! యీయింట్లో నాకిక స్థానంలేదు! హేమకి నేను చేసిన యీమోసం తెలియనివ్వకండి! పాపం బాధపడ్తుంది! యీముఖం మరి మీకు కనిపించను! వస్తా... (వెళ్ళి పోబోతుంటే హేముపరుగెత్తుకుంటూ వస్తుంది! శేఖరంప్రక్కనే తప్పుకుంటాడు!)

హేమ- (ఏడుస్తూ) యింత మోసం చేస్తారా?... యిది న్యాయమా ఎందుకిట్లాచేశారు! నేనేం ద్రోహంచేశాను? చెప్పండీ! ఎటువెళ్లి పోతున్నారు? ఎక్కడికి?

శేఖ- డాక్టరుగారూ! మతి భ్రమించినట్టుంది...

హేమ- ఎవరికి?... ఎవరికి భ్రమించింది మతి? మీకా నాకా?

డాక్ట- అమ్మా! హేమా?

హేమ- బాబయ్యా! చుశారా! తమ్ముడు చేసిన నేరం యీయన తనపై వేసుకొన్నారు...

## అనుమానం





శేఖ- ఎవరు చెప్పారు? నేనేదొంగను! నేనే!

హే.గ- చాల్లెండి! నాకంతా తెలిసింది! వాడే చెప్పాడు నన్ను యీవిధంగా మీరు తప్పించుకోవాలని అనుకుంటు న్నారేమో!... (యింతలో శీతారామయ్య ప్రవేసిస్తాడు పర ధ్యానంగా విచారంతో) అడుగునాన్నా! అడుగు నువ్వే! యీనటన యీమోసం యీనాటకం అంతాఎందుకో!

సీత- బాబూ! శేఖరం! నన్ను మన్నించు తొందరలో ఆలో చించకుండా ఏమిటేమిటో అన్నాను, పెద్దవాణ్ని, క్షమించు! ఆకోతి వెధవ చేసిన పనిని నీవిలా సమ ర్ధించడం బావుందా?...ఏమీ బాగులేదు నాయనా వాడిముష్టి బతుక్కి అప్పులు కూడాను...... అసలు నిన్ననాలోయ్ శ్రీనూ నీమీదనమ్మకం వుంచివాణ్ని పిడిచిపెట్టాను నీఆధీనంలో వాడిట్టా తయారయ్యాడు. పాపం! పిచ్చితల్లి! ఎంత బెంబేలు పడిపోయింది.

హేమ- మీరీపని చేశారంటే నమ్మలేక పోయాను.

సీత- ఏదో పొరపాటయి పోయింది లెండి! చాలీ నాటకం యీనాటికి తెల్లవారేటట్టుంది.

శేఖ- డాక్టరుగారూ! ఏమిటి చెయ్యడం?

సీత- నిద్రపోవడం అంతే యిదంతా ఒక పాడుపీడకల అను కొని మిగలిన యీరెండుగంటలూ నిద్రపోవడం!

శేఖ- యిక నేనేం చేసేది? ...నావశం తప్పింది; యికనాశక్తికి మించిన పనియిది యిక నేనశక్తుణ్ణి డాక్టరుగారూ మీరేఅడ్డు పడాలి.

హేమ- ఏమిటిది! ఏమిటండీ? ఏమిటిబాబయ్యా!

సీత- మహాగొడవచేసి పారేస్తున్నారే! ఏమిటి మీభాష? నాకేమీ అర్థం కావడంలేదు! ఏదోబైటికి చెప్పండి. ఏమిటి బాబూ శేఖరం?

శేఖ- (డాక్టరుదగ్గరికి వెళ్లి) ఏమిటి చెప్పమంటారు? నామాటలు వీళ్ళునమ్ముతారా నేనేం చేసేది డాక్టరుగారూ...... మీరే చెప్పాలి! నేను చెప్పలేను! చెప్పలేను!

హేమ- యేమిటదీ?... ఏమిటిబాబయ్యా!

సీత- ఏమిటా చిదంబరం రహస్యం? ఏమిటోయ్ ఆలోచిస్తున్నావేమిటి??

డాక్ట- ఆలోచించడం కాదు అసలువిషయం ఏమిటంటే...
(ఆగిపోతాడు)

హేమ- ఆగిపోయారేం? చెప్పండీ

డాక్ట- శేఖరం! గొప్పచిక్కులో సన్నిరికించావు! ఏమని చెప్పాలో...

సీత- బలేబావుంది! యిదంతా మీకొక నాటకం లాగున్నట్టుంది. ఎందుకిలా మమ్మ సందిగ్ధంలో పెట్టి చంపుతావు.

అనుమానం



డాక్ట- వెంకటనారాయణా నీవు పెద్దవాడివి అనుభవశాలివి! కొంచెం చెప్పకూడదూ!

వెంక- మీరు చెప్పమంటే చెప్తానండీ!...

సీత- ఏమిటోయ్!

వెంక- మొన్న అమ్మాయిగారూ తమరూ మావూరు రాలేదూ... క్రిందటి నెల 15 నండీ!

సీత- ఆ వస్తే ...

వెంక- ఆరోజునే శేఖరంగారూ కూడా అక్కడికి కొచ్చారండీ!

హేమ- అందరం కలిసే వచ్చాం మే!

వెంక- శేఖరంగారూ ఆస్పత్రి కొచ్చారమ్మా!

సీత- లేదే! ఆస్పత్రికి అమ్మాయీ నేనూ మాత్రమే వచ్చాం!

వెంక- మీరువచ్చేసరికి శేఖరంగారు రావడం వెళ్ళిపోవడం కూడా అయిపోయిందండీ!

సీత- ఆ! అయితే!

వెంక- చెప్తున్నానండీ శేఖరంగారూ పెళ్ళిచేసుకో బోతున్నాననీ అందుకోసం శరీరం పరీక్ష చెయ్యమనీ డాక్టరు గార్తో చెప్పి పరీక్ష చెయ్యించు కున్నారు.

సీత- బావుంది తనలాగే పెళ్ళిపెడాకులూ లేకుండా బ్రహ్మచారిగా వుండమనీ సలహా యిచ్చాడా యీమహానుభావుడు?

వెంక- అక్షరాల మీారన్నమాటలే అన్నారండీ !

హేమ- ఆ! పెళ్ళిచేసుకోవద్దనా? అవునా బాబయ్యా?

డాక్ట- (నిట్టూర్చి) ఔనమ్మా (అని తలదించుకుంటాడు)

సీత- ఏం? ఎందుకల్లాంటి సలహా యిచ్చావ్?

డాక్ట- శేఖరం హృదయంలో చాల ప్రమాదకరమైన జబ్బుంది.

సీత- ఆ! ఆ! ఉంది! చాలప్రమాద కరమైనదే 'ప్రేమ' అని యిదటోయ్! నీ తెలివి! యిందుకేనా లోకంలో నిన్ను మహాగొప్ప డాక్టరుగా పొగిడేస్తున్నారు !

డాక్ట- నువ్వంత తేలిగ్గా కొట్టి పారవేయకు సీతారాం శేఖరం జబ్బు అతివిచిత్రమైనది! ఆహృదయంలో చలనం ఏ క్షణంలో నయనా ఆగిపోవచ్చు!

సీత- చదవేస్తే వున్నమతి పోయిందట.

డాక్ట- నేను చెప్పిన దానిలో అణుమాత్రం అతిశయోక్తి లేదు. అదినంశపారంపర్యంగా వస్తున్న జబ్బు యిదిగో సీతారాం! యిది హేమ జీవితంతో సమ్మంధించిన విసయం బాగా ఆలోచించు ఆరోజు మీా యెదుటనే సర్జన్ శంకర్రావు సాసందేహాన్ని బలపరిచాడు జ్ఞాపకం లేదూ? కొంచెం నిదానంతో ఆలోచించమని నాకోరిక!

## అనుమానం



హేమ- (శేఖర్ దగ్గరికి వెళ్ళి) మీరింతగా బాధపడుతూ దాచటానికి ప్రయత్నించింది రహస్యమేనా? దీనికేనా నన్ను యింత బాధ పెట్టారు?

శేఖ- హేమా! అలా అనవద్దు యింతకు ముందు నీతో చెప్పినమాటే యిప్పుడూ చెప్తున్నాను. నేనుఅల్పాయుష్కుణ్ని దురదృష్టవంతుని అహర్నిశం మృత్యువు నోరు తెరిచి నాకోసం కాసుంది. ఏక్షణంలో నన్ను మింగివేస్తుందో! నన్ను నమ్మిన నీ బతుకు నడిఏటిలో అధ్వాన్నం అయిపోతుంది. వివాహం యావత్ జీవితానికే సంబంధించిన బ్రహ్మసూత్రం సుమా!

హేమ-హృదయాలకీ, అనురాగాలకీ సమ్మంధించిన పవిత్ర సూత్రం కాదూ?

డాక్ట- హేమా జాగ్రత్తగా ఆలోచించి మాట్లాడు!

హేమ- ఆలోచించే మాటాడుతున్నాను. బాబయ్యా! మీరు డాక్టర్లు! శస్త్రచికిత్స పేరుతో బ్రతికిన వాళ్ళనే మీరు కోస్తారు. ఉద్రేకాలూ, అనుభవాలూ అన్నీ మీలో చల్లారి నీరసించిపోతాయి హృదయాలను కదిలించే అనుభూతి మీచూపుకి అతిసామాన్యంగా కనిపిస్తుంది. మీకు హృదయంలేదు. ఉంటే మీరిల్లాంటి సలహా యిస్తారా? యింతమానసిక సంఘర్షణలో పడవేసి యింత బాధ కలిగిస్తారా? (శేఖరంసరసంగా సోఫాలో కూల

బడతాడు) లేదు సుమ్మా!టికే మీారు హృదయం లేసు!

సీత- అవునమ్మా! వాడికి హృదయం లేదు దాని స్థానంలో చలనం లేని నల్లరాయుంది. అందులో అభిమానం అనుతాపం మచ్చుకికూడా లేవు. ఏనాడో వాడిహృదయం నిర్జీవమైపోయింది. ఆకిరస్తాసి మేరీవాడి మనస్సు ఎడారిచేసి వెళిపోయింది.

డాక్టర్- ఏమిటా అసందర్భపు ప్రేలాపన?...అమ్మాయి భావి జీవితం సందిగ్ధంలో ఊగుతూవుంటే యిప్పుడా వేళాకోళాలు?

హేమ-కాదు బాబయ్యా! నిజం చెప్పండి మీారు పేరొందిన డాక్టర్లు గుండెజబ్బుందన్నారు. మీామాట కాదనను. అది ఆతని దోషమా! అందుకని మాయిద్దరినీ ఎడబాటు కమ్మంటారా? యిదేమయినా శావుందీ?

డాక్టర్- అమ్మాయ్ హేమా! నీవు నాకు ఆత్మీయురాలివి. తెలిసి తెలిసి...

హేమ-యిదికుదిరే మార్గంలేదా బాబయ్యా?

డాక్టర్- లేదమ్మా. నాకు తెలిసినంతవరకూ...

వెంక- క్షమించండిసార్! ప్రయత్నం మనం చెయ్యాసిదే...

డాక్టర్- ఎందుకు వృథాప్రయత్నం అమ్మాయ్ హేమా! యిది నీకు కఠోరపరీక్షా సమయం నీభవిష్యం నిర్ణయించుకో



వలసిన సమస్య నీయెదుట నిలబడుంది. హృదయ దౌర్బల్యానికి తావివ్వకమ్మా! వాస్తవికాన్ని విస్మరించకు... సీతారామయ్యా! అలా చూస్తూ నిలుచుంటావేం? కన్నతండ్రివి. కూతురు బాగోగులు నిర్ణయించే బాధ్యత నీది! ఆమెజీవితం నీవయినా అమ్మాయికి నచ్చచెప్పి బోధపరచూ చిన్ననాటి మనస్నేహం పేరున యిలా చెప్తున్నాననుకోవద్దు రోగాలకి జీవితాన్ని అంకితం చేసిన డాక్టరుగా యీమాటలు చెప్తున్నాను.

సీత- శ్రీమా నన్ను గొప్పఅవస్థలో పెట్టేశావ్! అమ్మాయ్! నీమాటలు వింటే నామతిపోతుంది చూడమ్మా! మొండికెత్తి మూర్ఖంగా చీకటిలోనికి దూకడం మంచిదికాదు. తండ్రిని... నీజీవితంలో ఆనందం సౌఖ్యం సౌభాగ్యం సర్వదా వుండాలనే నాకోరిక. నీ వివేకం మీద నాకు సంపూర్ణమైన నమ్మకం వుంది. కోరికోరి ప్రమాదాన్ని కొని తెచ్చుకోవడం...

హేమ-(దుఃఖంతో) నాన్నా మీరూ ఆమాటే అన్నారూ! మీఅందరికీ నాఒక్కర్తె బాగోగులేనా కావాలి? ఒక్క నాసౌఖ్యం మాత్రమే మీరాలోచిస్తున్నారా? ఆయన సంగతెందుకు గమనించరు? ఏం కానున్నదో కానీ



నాకర్మలో ఎలా జరగాలనుందో జరగనీ యీవిష యంలో మీరు బాధ్యులమని బాధ పడకండి ఆలశ్యం ఎలాగూ జరిగి పోయింది. యింకా జాగు చెయ్యడానికి వీలులేదు. రేపే మాకు వివాహం చెయ్యడానికి యేర్పాట్లుచెయ్యండి యిందుకు మీరుమారు చెప్పకండి మీపాదాలు పడతాను దీనికి వ్యతిరేకించకండి యిక మీదట ఆయన్ని ఒక్క-క్షణం ఒంటరిగా విడిచి ఉం డను. మృత్యువుతో పోరాడయినా నాకిక నావా రిగా చేసుకుంటాను.

డాక్ట- హేమా! ఉద్రేకంలో యుక్తాయుక్త విచక్షణ మరిచి పోతున్నావు.

సీత- అమ్మాయ్! చిన్నదానివి కావు! బాధ్యతలు తెలిసిన వివేకవంతురాలివి. తొందరపడకమ్మా సావకాశంగా ఆలోచిద్దాంలే!

హేమ- నాన్నా! సావకాశంగా కూర్చొని ఆలోచించడానికి వ్యవధియేదీ? నిమిషనిమిషానికీ నాచేతికి అందకుండా ఆయన దూరం అయిపోతున్నారే! సావకాశంగా ఆలో చిస్తూ కూర్చోగలనా నాన్నా! రేపే మావివాహం! ఒక్క-క్షణం దాటించడానికి వీలులేదు! యీ మిగిలిన అమూల్య క్షణాలయినా ఆయనకు భార్యగా సేవచేసే



భాగ్యం నాకివ్వండి! చావు తన కౌగిలిలోనికి తీసుకొని పోయేముందు ఆ క్షుభిత హృదయానికి నేనివ్వగలిగినంత శాంతి సౌఖ్యాలు యిస్తాను! (శేఖరం దగ్గరికెళ్ళి) ఏమండీ! మీ ఆందోళన తగ్గిందా? యిప్పుడు మీ మనస్సు తేలికయిందా?... మీ హృదయం చల్లబడిందా? (చేయి చూచి భయంతో మెరుపులా లేచి శేఖరం చెక్కిళ్ళు తాకి) బాబయ్యా! ఒళ్ళు చల్లబడిపోయిందేమిటీ?... (శేఖరం తల గుండెలమీదికి వ్రాలిపోతుంది

డాక్టర్ (ఆందోళనతో) ఆ! చల్లబడిందా? (దగ్గరికొచ్చి పరీక్షచేస్తుంటాడు)

సీత- శేఖరం! శేఖరం! బాబూ (కదలబోతాడు. డాక్టరు నాడి విడిచి, నిట్టూరుస్తాడు)

హేమ- బాబయ్యా! ఏమిటయింది? చెప్పరేం? అలా చూస్తారేంటి ఏమిటయింది?

సీత- ఏమిటయింది శ్రీనూ?...

డాక్టర్- భగవంతుడు మన సమస్యను తనే పరిష్కారంచేశాడు.

హేమ-- ఆ! ఏమిటీ! (అర్థంకానట్టు పిచ్చిచూపులు చూస్తుంది)

సీత- ఏమిటన్నావ్? (శేఖరం చొక్కా విప్పబోతాడు)

డాక్టర్- సందేహంలేదు సీతారాం! శేఖరం మరి మనలోలేడు హు! మృత్యువు యింత హఠాత్తుగా వచ్చి మింగేస్తుదనుకోలేదు! (డాక్టర్ ప్రక్కకి తిరుగుతాడు సీతారామయ్య





దుఃఖం ఆపుకోలేక పోతాడు. హేమకి యిప్పుడర్థమౌతుంది. పెద్ద అరుపు అరచి_శేఖరం ముందు కూలిపోతుంది)

హేమ- అయ్యో భగవంతుడా! యింత అన్యాయం చేశావా? నా బ్రతుకిలా బ్రద్దలు చేశావా! అయ్యో! ఏవండీ మాట్లాడరేం? యిలా నన్నిక్కడ వొంటిగా వదలిపారిపోయారా? మీకు ధర్మమేనా? యి కెవరికోసం నా బ్రతుక? ఆఖరి మాటకి కూడ నోచుకోలేదా? ... అయ్యో! యింతలోనే యీ ప్రళయం ముంచుకొచ్చిందా? అయ్యో! ఏవండీ! ఏవండీ! ఒక్కసారి! ఒక్కసారి! మీ హేమను పలుకరించరూ! ఒక్కసారి! (తల మోకాలికి కొట్టుకుంటుంది)

సీత- (కన్నీటితో వారిస్తూ) తల్లీ నా చిట్టితల్లీ ఏడువకు! ఏడువకు లే-లే! భగవంతుడు నీకు అన్యాయం చేశాడు. నీ ఆనందం చూడలేకపోయాడు ... లే అమ్మా లే! నా మాట వినూ! యేడ్చి యేం ప్రయోజనం!

హేమ- (తండ్రి పాదాలు పట్టుకొని) నాన్నా! నాన్నా-యింకేముంది నాకు! నాలోకం కూలిపోయింది- నా బ్రతుకు కాలిపోయింది-నా రాజు మాయమైపోయాడు! అయ్యో నాన్నా! భగవంతుడా! (గోపాలం భయంతో మెల్లగా లోపలికొస్తాడు) తమ్ముడూ! యింకేముందిరా తమ్ముడూ! అంతా అయిపోయింది! మీ శేఖరం మరి లేరురా! నన్ను వొదిలి వెళ్ళిపోయారురా తమ్ముడూ!

అనుమానం 

డాక్ట- ఊరో - అమ్మా! కాస్త స్థిమితపడూ!

హేమ- ఎలా స్థిమితపడ్డం బాబయ్యా! యిక నాకేముందని? యేమిటిచూసుకొని బ్రతకాలింక?... యేమండీ?... మరి కనిపించరా! నాతో మాటాడరా?... నన్నొదిలి వెళ్ళి పోయారా?...

డాక్ట- సీతారాం! అమ్మాయిని లోనికి తీస్కెళ్తే మంచిదేమో వెళ్ళమ్మా!...

సీతా- రా! అమ్మా! రా!

హేమ- నారాజాను వొదిలి వెళ్ళలేను బాబో! ... నా రాజా ముఖం రెండు క్షణాలయినా చూసుకోనివ్వరూ? రాజా ఏవండీ నా బాధచూసి నవ్వుతున్నారా? ... మీతో కూడా నన్నూ తీసుకొనిపోరూ!

సీతా- లే! లెమ్మంటుంటే! లే అమ్మా!

హేమ- నేనురాను! నాన్నా! నన్ను ఒదలండి - నారాజాను నన్ను వేరు చెయ్యకండి నాన్నా...నాన్నా! రాజా రాజా (భుజంపట్టుకొని లేవనెత్తి సీతారామయ్య గోపాలం హేమని లోనికి తీస్కెళ్తారు కేకలు వినుపిస్తునే వుంటాయి!)

డాక్ట- (శేఖర్ ముఖంచూస్తూ) యెంత విచిత్రంగాముంచుకొచ్చిందో! ... యేమీ చెయ్యడానిక్కూడా అవకాశం లేకుండా!

అనుమానం



వెంక- ఎవరూ ఏమీ చెయ్యలేరు యిది భగవన్నిర్ణయం అది మాత్రం నిజం-కాని యింతవరకు యిల్లాంటి సంఘటన నేను కని విని యెరుగను! యేమో! దీని పర్యవసానం యేమిటో!... మంచికో చెడుకో యెవరు చెప్పగలరు ముఖ్యంగా అమ్మాయి జీవితం యేమవుతుందికపైన... అమ్మాయి యీసంఘటనవల్ల రక్షింపబడిందా లేక బ్రతుకులో తిరిగి తేరుకోలేని దెబ్బతిన్నదా? అనుమానమే! అమ్మాయి కీరోజు మంచిరోజో చెడురోజో అనుమానమే!

డాక్ట- అవును! యీ అనుమానంకి సమాధానం కాలగర్భంలో వుంది! ఆరోజు వచ్చిందాకా యీ నీ అనుమానం అందరికీ అనుమానంగానే వుండిపోతుంది

తెర పడుతుంది.









| | మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRWA 101 B 186 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |